# లవ్ కోడ్స్

( లేడీ లవ్ బర్డ్సకి నాటీ లవ్ గైడ్ )

స్వప్న కంఠంనేని తలశిల



# పరిచయం

స్వప్న చిన్న వయస్సులోనే రచనా వ్యాసంగాన్ని ప్రారంభించింది. 8వ తరగతిలో ఉండగా 'పల్లకి' వారపత్రికలో కథ ప్రచురితమైంది. ఎమ్.సి.ఎ. చదివే రోజుల్లో 'మై డియర్ రోమియో' సీరియల్‌గా వెలువడింది ఆంధ్రభూమి వీక్లీలో. మధ్యలో అసంఖ్యాకంగా వ్యాసాలు, డజనుకు పైగా కథలు...

పుట్టింది పోచంపాడు ప్రాజెక్టులో (ఇప్పటి శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్). తను పుట్టిన ఊరు గురించి చాలా గర్వంగా మాట్లాడుతుంది.

స్వప్న రచనల్లో చక్కటి హ్యూమర్ తొణికిసలాడుతుంది, మాటల్లో కూడా.

న్యూయార్క్ స్టేట్‌లోని రాచెస్టర్‌లో 'బిజినెస్ అప్లికేషన్స్ ఎనలిస్టు'గా తల మునకలైన పనులలో ఉంటూ కూడా "తెలుగు పాఠకుల్ని వదలను, హింసించక మానను" అంటూ ప్రతినలు చేస్తుంటుంది.

*I am very very proud of her - my daughter!*

- కంఠంనేని రాధాకృష్ణమూర్తి

# లవ్ కోడ్స్


○ రచన :
**స్వప్న కంఠంనేని తలశిల**

○ మొదటి ముద్రణ :
**ఆగష్టు 1999**





○ కవర్ డిజైన్ :
**లేపాక్షి రెడ్డి** ఫోన్ : 3395818

○ వెల : **రూ. 30**

○ కంప్యూటర్ టైప్ సెట్టింగ్
**కిరీటి క్రియేషన్స్** ఫోన్ : 7662155

○ ముద్రణ :
**సాయిరాం ప్రాసెస్**
ఫ్లాట్ నెం. 114, సావరిన్ షెల్టర్స్
లకడీకాపూల్, హైదరాబాద్
ఫోన్ : 3307622, 3398809

○ సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞాన్ భవన్,
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.
**విశాలాంధ్ర బుక్ హౌస్**
విజయవాడ, హైదరాబాద్, అనంతపురం, విశాఖపట్నం,
గుంటూరు, తిరుపతి, కాకినాడ, హన్మకొండ

○ ప్రచురణ :
**నిహిల్ పబ్లికేషన్స్**
8-3-690/ఎ, ఎల్లారెడ్డి గూడ,
హైదరాబాద్ - 500 073. ఫోన్ : 3737123



*To*

*my*

*Loving Hubby*

*Prasad Talasila*

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | ఆడవారి బలహీనాలు | ..... | 10 |
| 2. | చూపుల భాష్యం | ..... | 17 |
| 3. | నోరు, నవ్వు ఏం చెబుతాయి? | ..... | 24 |
| 4. | వస్త్రధారణ ఏం చెబుతుంది? | ..... | 31 |
| 5. | ఫ్యాషను, నడక ఏం చెబుతాయి? | ..... | 38 |
| 6. | షికారు ఛందస్సు | ..... | 44 |
| 7. | డ్రైవింగ్ చేసే తీరు, టిప్పిచ్చే హోరు | ..... | 52 |
| 8. | నలుగురిలో ప్రవర్తన ఏం చెబుతుంది? | ..... | 60 |
| 9. | పుస్తకాల పట్ల ప్రేమ ఏం చెబుతుంది? | ..... | 66 |
| 10. | ఇష్టపడే సంగీతం, పెయింటింగ్స్ ఏం చెబుతాయి? | ..... | 73 |
| 11. | స్నేహితుల్ని బట్టి అతడి మనస్తత్వం | ..... | 81 |
| 12. | ఎలాంటి కుటుంబంలో పెరిగాడు? | ..... | 90 |
| 13. | కుటుంబ సభ్యులతో బంధాలు | ..... | 97 |
| 14. | ఉద్వేగాలు - వ్యక్తిత్వం | ..... | 104 |
| 15. | నానా గుణాభిరాముడు | ..... | 110 |
| 16. | విజయపథ విక్రమార్కుడు | ..... | 116 |
| 17. | ఆర్థిక విజయాలు - ఉద్వేగ ఫలితాలు | ..... | 121 |
| 18. | మంచి భర్త అవుతాడా లేదా? | ..... | 128 |
| 19. | మేడ్ ఫర్ ఈచ్ అదరేనా? | ..... | 134 |

# 1



# ఆడవారి బలహీనాలు

## (ప్రేమలో పడబోయే ముందు ఒక నిమిషం ఆగు బేబీ!)

శైలజ సుధీర్‌ని ప్రేమించి పెళ్ళి చేసుకుంది.

రెండు సంవత్సరాల తర్వాత కలసిన ఆప్తమిత్రురాలితో "సుధీర్ ఇట్లాంటివాడని నేననుకోలేదు. ముందే తెలిసి నట్లయితే అతణ్ణి పెళ్ళాడి ఉండేదాన్ని కాదు" అన్నది నిరాశగా.

సుధీర్ ఎట్లాంటివాడన్నది ఇక్కడ అనవసరం.

శైలజ తన ప్రేమ, పెళ్ళి విషయాల్లో పప్పులో కాలేసింది!

ఇలా ఎందుకు జరిగింది?

ఆధునికత పెరిగిపోతున్న కొద్దీ సమాజంలో స్త్రీ పురుషులు ప్రేమ వివాహాల వైపు మొగ్గు చూపుతున్నారన్నది నేటి వాస్తవం! ముఖ్యంగా విద్యావంతులు.

అయితే వీటిలో కొన్ని విజయవంతమవుతోంటే మరి కొన్ని ఘోరంగా విఫలమవుతున్నాయి. చాలామంది మేకపోతు గాంభీర్యాన్ని ప్రదర్శిస్తారు గాని నిశితంగా పరిశీలిస్తే నానా రకాల లొసుగులతో ఈ రెండో బాపతు వివాహాలే సమాజంలో ఎక్కువగా కనిపిస్తుంటాయి.

విఫలమవుతున్న వివాహాల్లో ఎక్కువ భాగం తాను ప్రేమిస్తున్నవాడి గురించి అమ్మాయి అంతగా స్టడీ చేయకపోవటమూ, అతనెలాంటివాడో, తనకు సరితగ్గవాడు



అవునో కాదో అంచనా వేసుకోలేకపోవటమూ, ఏ సానుకూల పరిస్థితుల మూలంగానో తనకు తటస్థపడ్డ, తనతో సన్నిహితంగా మెలగిన యువకుడిని గుడ్డెద్దు చేలో పడ్డట్లుగా మోహించి ప్రేమించి వివాహమాడటమూ లాంటి తొందరపాటుతనాలు కారణాలుగా పనిచేస్తుంటాయి.

ప్రస్తుత సమాజ సంప్రదాయాల ప్రకారం వివాహమనేది యువతీ యువకులకు జీవితంలో ఒకసారి మాత్రమే లభించే అపురూప అవకాశం! పురుషుడిని సరిగా పరిశీలించకుండా ప్రేమించటం, అతడి జీవిత సహచారిణి కావటం, కొన్నాళ్ళ తర్వాత అతనిలో అవలక్షణాలు కనిపించి "అయ్యో ఇందుకా పెళ్ళాడింది?" అని వాపోవటం లాంటివి ఆ అవకాశాన్ని సద్వినియోగపరుచుకోకపోవటం కిందికే వస్తాయి.

అందుకే -

పెళ్ళికి ముందే, ప్రేమలో పడక ముందే, తన వలలో పడబోతున్న తనను

వలలో వేసుకోబోతున్న యువకుడి గురించి ప్రతి అమ్మాయి, ప్రతి యువతీ నిశితంగా పరిశీలించాలి. పరిశీలించి అతని మనస్తత్వమేమిటో అర్థం చేసుకోవాలి. ఆ మనస్తత్వం తనకు సూటవుతుందో లేదో అవగాహనకు రావాలి...

అదుగో, అలాంటి యువతుల కోసం ఈ పుస్తకం-

అయితే పురుషుడిని పరిశీలించటమనేది ఎలా? అతడి మనస్తత్వాన్ని తెలుసుకోవటం సాధ్యమేనా??

సాధ్యమే!

అతడి వేషధారణ, అభిరుచులు, అలవాట్లు, కుటుంబ చరిత్ర, జీవన శైలి, నడిచే తీరు, చూపుల తీరు, పడుకునే భంగిమ, ఫంక్షన్లలో పార్టీలలో అతను ప్రవర్తించే తీరు, అతను చదివే పుస్తకాలు, బుక్‌షెల్ఫ్‌లో అతను పుస్తకాల్ని వుంచే తీరు, ఇలాటి అనేకానేక విషయాలు యువకుల మనస్తత్వాల్ని ప్రతిబింబిస్తుంటాయి.

ఈ విషయాలు ఆ మనిషి స్వార్థపరుడో-విశాల హృదయుడో, నమ్మకస్తుడో-వంచించే బాపతో, రోమియోనో-ప్రేమియోనో తెలియజేస్తాయి.

కాలేజీ చదువులు చదువుతున్న అమ్మాయిలు గానీ, ఆర్జన చేస్తున్న ఉద్యోగినులు గానీ తమ చుట్టూ ఝుమ్మంటూ తిరుగాడే అబ్బాయిలను ఎక్స్‌రే కళ్ళతో అవలోకించి, సూక్ష్మదృష్టితో పరిశీలించి ఇతను ఫలానా, ఇతను తనకు నప్పుతాడు లేక నప్పడు అనే అవగాహనకు రావటానికి సహకరిస్తుంది ఈ పుస్తకం.

- ఒక్క అవివాహిత యువతులే కాదు. వివాహిత స్త్రీలు కూడా తమ భర్తల గురించి తెలుసుకోవటానికి ఉపకరిస్తుంది ఈ పుస్తకం.

మొదటగా యువతులు యువకులకు సంబంధించి ఎక్కడ పప్పులో కాలు వేస్తారో ఎందుకు వేస్తారో చూద్దాము.

## ప్రౌఢకన్యల వేగిరపాటు!

- కొందరు స్త్రీలు ఏ కారణం వల్లో చానాళ్ళ దాకా పెళ్ళి చేసుకోకుండా జాప్యం చేస్తారు. ఆర్థిక కారణాల వల్లో, ఆదర్శాల నెపం తోనో, లేక తానేదో గొప్ప అందగత్తె అనో, ప్రత్యేకమైన స్త్రీ అనో, వ్యర్థ వానిటీతో, ఎవరూ నచ్చక, ఎవరిని అంగీకరించటానికీ ఇచ్చగించక, సంవత్సరాల తరబడి అవివాహితలుగా మిగిలిపోతారు.
- ఈ లోపల వయస్సు పాతికేళ్ళు దాటేస్తుంది. అకస్మాత్తుగా ఓరోజు మనస్సులోకి ఒక సందేహం ప్రవేశిస్తుంది.
- "ఏమిటి తనకింకా పెళ్ళి కాలేదు? వయస్సు దాటిపోవటంలా? అసలు తనకు పెళ్ళవుతుందా లేదా??"

- ఇక్కడినుంచీ ఆమె మనస్సు త్వరగా పెళ్ళి చేసుకొమ్మంటూ వేగిరపరుస్తుంది. లోపల నుంచి శరీరం కూడా కోర్కెల ఆవిరులను కక్కుతుంటుంది.
- ఈ తొందరపాటులో తన పట్ల ఆసక్తి చూపిన యువకుడినెవరినో వెనకా ముందూ చూడకుండా పెళ్ళాడేస్తుంది. ఆమె అదృష్టం బాగుంటే సరేసరి, లేకపోతే ఓ ఏడాదిలోపే ఆమె శోకిల్లాల్సిన, భీతిల్లాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది.

## మోహిత స్త్రీ దౌర్బల్యం

- మరొక స్త్రీ ఉంటుంది. ఆమె మరీ మెటీరియలిస్టిక్‌గా ఒక యువకుడి దేహ సౌష్టవాన్ని చూసి మోహిస్తుంది. ఇలాంటి మోహం కలవాళ్ళు సెక్సు సంబంధాల విషయంలో త్వరగా లొంగిపోతారు. ఆ తర్వాత మిగిలేది వివాహం! అది కాస్తా తప్పనిసరి అవుతుంది.
- అయితే ఒకటి - స్త్రీల లాగే పురుషులకు కూడా శరీరం అందంగా ఉన్నంత మాత్రాన మనస్సు అందంగా ఉంటుందన్న గ్యారంటీ ఏమీ ఉండదు.
- త్వరలోనే ఈ చెప్పిన స్త్రీకి తను లొంగిన, లేక తనను లొంగదీసుకున్న పురుషుడిలో అవలక్షణాలు ఏవన్నా ఉంటే అవి ఒకటొకటిగా బయల్పడటం మొదలవుతాయి. అతనిలోని ఆ అవలక్షణాల లాగే ఆమెలో ఖేదం కూడా మొదలవుతుంది.

## మేధ చూసి మోసపోయే స్త్రీ

- ఒక యువకుడిలోని చదువు రాణింపో లేక మేధాప్రదర్శననో చూసి ఒక యువతి అతణ్ణి ప్రేమించవచ్చు. బహుశా అతను అందంగా ఉండవచ్చు లేక అతనికి బాగా డబ్బుండవచ్చు. సామాజికంగా పేరు ప్రతిష్ఠలుండవచ్చు. ఇలాటి లక్షణాల్ని చూసి మిగతా స్త్రీలు అతని చుట్టూ వెంపర్లాడుతుంటారు. ఈ యువతికి కూడా అతని పట్ల పిచ్చిమోజు పెరుగుతుంది. పెళ్ళి చేసుకుంటుంది.
- ఒక వ్యక్తిని కేవలం అతడిలోని లౌకిక విజయాల్ని చూసి ప్రేమిస్తే ఆ యువతి విషాదించక తప్పదు. ప్రియుడిలో ఆమె చూడాల్సిన మరో విషయం కూడా ఉంది. అది ఎమోషనల్‌గా అతడు తనతో అడ్జస్ట్ అవుతాడా లేదా అన్నది. ఈ అడ్జస్ట్‌మెంట్ కుదరకపోతే ఆమె నిరాశ చెందక తప్పదు.

## కులాసాతనం చూసి...

- ఒక వ్యక్తి చాలా కలుపుగోలుతనంతో, మాటకారి తనంతో, కులాసా పురుషుడిలా కనిపించి ఒక స్త్రీని ఆకట్టుకోవచ్చు. అతని సమక్షంలో ఆహ్లాదకరంగా ఫీలయి

ఆమె అతణ్ణి ప్రేమిస్తుంది, పెళ్లాడుతుంది. తర్వాత?

- ప్రేమించే సమయంలోనే ఆమె అతణ్ణి పూర్తిగా స్టడీ చేయాలి. ఇది అతని సహజ లక్షణమా, లేక కేవలం తన వద్దే ప్రదర్శిస్తున్నాడా... లాంటివి. ఎందుకంటే ఏ యువకుడైనా తానొక యువతిని వలలో వేసుకోదల్చుకున్నప్పుడు ఆమె తన వలలో పడేదాకా ప్రారంభ దశలో చమత్కారంగా మాట్లాడుతూ కులాసా దిలాసాగానే ప్రవర్తిస్తాడు.
- అవసరం కాస్తా తీరిపోయాక మాత్రమే అతనిలోని అసలు ప్రవృత్తి బయటపడుతుంది. ఆమెకు చెందిన ఏ డబ్బును చూసో ప్రేమించి పెళ్ళాడితే ఆ తర్వాత నుంచీ అతనిలోని 'విలనీయ' విశ్వరూపం బయటపడుతుంది. ఆమె లబలబలాడటం మొదలవుతుంది.
- ఇలాంటి అనేకానేక కారణాల మూలంగా ఏ యువతి గానీ తాను ప్రేమించే లేక పెళ్ళాడబోయే యువకుడిని వివిధ కోణాల నుంచి నిశితంగా అబ్జర్వ్ చేసి ఆకళింపు చేసుకోవాలి. అప్పుడు గానీ ఆమె తర్వాత పశ్చాత్తాపపడాల్సిన స్థితి నుంచి తప్పించుకోలేదు.

## అయిదు అంతర్మథనాలు

ఒక యువకుడు తటస్థించి క్రమంగా తనాతని వేపు ఆకర్షించబడుతున్నప్పుడు ప్రతి యువతీ విధిగా ఈ కింది అయిదు ప్రశ్నలనూ వేసుకుని తనను తాను శోధించుకోవాల్సిన అవసరం ఉంది.

***1. అతను తొలిచూపులోనే ఆకట్టుకుంటున్నాడు. అయితే అదంతా నిజమేనా, అందులో నాటకమేమీ లేదు కదా!?***

- ఇంతకు ముందే చెప్పుకున్నట్లుగా ప్రేమ తొలి దశలో ఉన్నప్పుడు ఏ మనిషైనా అవతలి మనిషిని ఆకట్టుకోవటానికి సర్వశోభాయమానుడిగా కనిపించటానికే ప్రయత్నిస్తాడు. తనలోని లోపాలను కప్పెట్టి ఉంచటానికి ప్రయత్నిస్తాడు.
- పైకి నిశ్చలచిత్తుడుగా కనిపించేవాడు లోపల నిజానికి పెళుసు మనస్కుడూ, అభద్రతా భావంతో బాధపడుతున్నవాడూ కావచ్చు. పైకి ప్రతిదానికీ తల వూపుతున్నట్లు కనిపించే వాడు వాస్తవంలో మిమ్మల్ని నమ్మించటానికి మాత్రమే అలా నటిస్తుండవచ్చు.

❑ కొందరు పురుషులు యువతుల్ని వలలో వేసుకోవటానికి తాత్కాలికంగా ఇలాంటి సమ్మోహజాలాన్నీ, చాకచక్యాన్నీ ప్రదర్శిస్తుంటారు. అలాంటి వాళ్ళ మనస్తత్వాన్ని

తెలుసుకోవటం ఒక పట్టాన సాధ్యం కాదు. అయితే అతడు ప్రమత్తంగా ఉన్న సమయాన అతడిలోని అసలు మనిషిని పట్టేయవచ్చు.

- ఉదాహరణకు అతడు బేరర్‌కి టిప్పుని ఎలా ఇస్తున్నాడు, కరచాలనం ఎలా చేస్తున్నాడు, వీధిని ఎలా దాటుతున్నాడు, లాంటి వాటిని అబ్జర్వ్ చేయడం ద్వారా అతడిలోని కొంగ జపాన్ని అర్థం చేసుకోవచ్చు.

2. ***నిజంగా అతడు మీతో బంధాన్ని కోరుకుంటున్నాడా?***

- కొందరు పురుషులు ఆడవాళ్ళతో తాత్కాలిక సంబంధాలకే ఇచ్ఛగిస్తారు గానీ శాశ్వత అనుబంధం ఏర్పరచుకోవాల్సి వచ్చేసరికి ఉలిక్కిపడతారు. అందుకే ప్రేమ ప్రారంభదశలో "నువ్వు లేకుండా నేను బ్రతకలేను" అన్నవాడు కాస్తా ప్రియురాలికి తన మూలంగా గర్భం వచ్చిందని తెలియగానే మొహం చాటేస్తారు.
- క్రమంగా ఆమెను కలుసుకోవటం తగ్గించటం, లేనిపోని గొడవ పెట్టుకోవడం, ఆమెనుంచి అర్థం పర్థం లేని డిమాండ్లు చేయడం మొదలెడతారు. దీని అర్థం ఇక ఆమెతో తెగతెంపులు చేసుకోవటానికి చూస్తున్నాడన్నమాట...

❒ అతడు మీతో శాశ్వత బంధాన్నే కోరుకుంటున్నాడో తాత్కాలికంగా కోర్కెల్ని తీర్చుకోవటానికే చూస్తున్నాడో తెలుసుకోవటం ఎలా?

- అతడి పూర్వపు సంబంధాలేమిటి, అతని ఉద్యోగ చరిత్ర ఏమిటి, అతని గది అలంకరణ ఎలా ఉంది... లాంటి వాటిని పరిశీలించటం ద్వారా తెలుసుకోవచ్చు. అదెలాగో ముందు ముందు చూద్దాం.

3. ***ఎమోషనల్ గా అతను మీకు చేయూతనిస్తాడా లేదా?***

- నిజమైన ప్రేమలో ఉన్న పురుషుడెప్పుడూ తన స్త్రీ విజయాన్ని కాంక్షిస్తాడు. ఎమోషనల్ గా ఆమెకు చేయూతనందివ్వటానికి ప్రయత్నిస్తాడు.
- ప్రియురాలి ఆశయాలు, లక్ష్యాలు కూడా తన ఆశయాలు, లక్ష్యాలంత ప్రాముఖ్యత గలవనీ, తమ మధ్య ఎమోషనల్ గా ఆరోగ్యవంతమైన సంబంధాలుండాలనీ భావిస్తాడు.

❒ అతడు మరి ఎమోషనల్‌గా చేయూతనిచ్చే మనిషి అవునో కాదో తెలుసుకోవటం ఎట్లా?

- సాయంత్రం మీరేదన్నా ప్రోగ్రాం పెట్టుకున్నప్పుడు దానిని నిర్ణయించే విషయంలో మీ అభిప్రాయానికి విలువ ఇస్తాడో లేదో, లేక మీరేదన్నా

విషయమై సలహా అడిగినప్పుడు అతను ఎలా ప్రతిస్పందిస్తాడో మొదలైన వాటి ద్వారా తెలుసుకోవచ్చు.

4. ***స్త్రీలో అతను ఏమి కోరుకుంటున్నాడు?***

- తిరస్కరించబడతామేమోనన్న భయంలో పురుషులు ప్రేమ ప్రారంభదశలో తమ అసలు అభిప్రాయాన్ని కాక ప్రియురాలికి ఇష్టమైన అభిప్రాయాలనే వ్యక్తం చేయటానికి ప్రయత్నిస్తారు.
- ప్రియురాలితో అతను తాను స్వతంత్ర అభిప్రాయాలు గల ఆధునిక యువతిని ఇష్టపడతానని చెప్పవచ్చు. కాని లోలోపల సంప్రదాయబద్ధమైన యువతిని కోరుకోవచ్చు.
- ఆమెతో "నువ్వే నేను, నేనే నువ్వు" అనవచ్చు. కాని లోలోపల 'మొత్తం తానే' ననే స్వార్థబుద్ధితో ఉండవచ్చు.
- దీనిని తెలుసుకోవటం ఎట్లా?
  - అతని గదిలో వస్తువుల అమరిక, అతను ధరించే దుస్తులు, ఆభరణాల తీరు మొదలైన వాటి ద్వారా అతడి వ్యక్తిగత విలువలేమిటో తెలిసి వస్తాయి.

5. ***మొత్తం మీద అతడు మిమ్మల్ని నిరాశపరచడు కదా?***

- ఏ స్త్రీ అయినా తన ప్రేమ విజయవంతమై అంతిమాన ప్రియుడు తనను వివాహమాడాలని కోరుకుంటుంది. ప్రేమ, వివాహానికి దారితీయకపోవటం కంటే దారుణమైన నిరాశ స్త్రీకి మరొకటి ఉండదు.
- ఒకవేళ అతను తనను నిరాశ పరుస్తాడేమో....
- ఎలా దీనిని తెలుసుకోవటం?
  - అతను అభిమానించే రంగులు, ఎంత నీటుగా ఉంటాడు, నిద్రపోయే భంగిమలో పిడికిళ్ళు బిగిస్తాడా, లాంటి విషయాల్ని విశ్లేషించటం ద్వారా అతని ప్రవృత్తిని అర్థం చేసుకుని ఆమె జాగ్రత్త పడవచ్చు.

సో...

ప్రేమలో పడబోయే అమ్మాయిలు, హృదయాన్ని పారేసుకోబోయే యువతులు, తమ జాగ్రత్తలో తాముండటం కోసం - తాము కోరుకుంటున్న పురుషుడు గోవో, సాధువో, గుంటనక్కో, గర్జించే పులో తెలుసుకోవటానికి పనికి వచ్చే - రోమియో విశ్లేషణా వివరాల్ని ఈ పుస్తకం లోని మిగతా అధ్యాయాల్లో చూడగల్గుతారు...

# 2



# చూపుల భాష్యం

(ప్రేమిస్తున్నానని చెప్పిన అబ్బాయి
నీ కళ్ళలోకి సూటిగా చూస్తాడా?)

లేడి కళ్ళ లేడీ కూనా,
వలపులో పడ్డావా పాపం!
ప్రిన్స్ చామింగ్ కనిపించాడా నీకు?
అతనెలాంటివాడో-
సరసుడో విరసుడో
వలపు బాణం వదలాలో వద్దో-
టక్కరివాడో టక్కుటమారాల వాడో-
ఆ బాణాన్ని తిరిగి నీకే వదిలి
నిన్ను బోల్తా కొట్టించాడు కదా!?
-అని సందేహ పడుతున్నావా పాపం!
సతమతమవుతున్నావా పాపా?

వెత చెందకు బేబీ! కలలో కూడా నిన్ను కలవరపరుస్తున్న ఆ నలకూబరుణ్ణి స్టడీ చేయటానికి నీకు కొన్ని సూత్రాలు చెబుతాను.....

## మొహం నిండా నగ్నసత్యాలే!

అందమనేది చర్మంలోతు మాత్రమేనంటారు విజ్ఞులు. కాని ఆ చర్మంమీద, ముఖ్యంగా మొహపు చర్మం మీద కాలం ఏర్పరచిన ముద్రలు ఆ వ్యక్తి మనస్తత్వాన్ని తెలియజెప్పతాయని చాలామందికి తెలియదు.

పుట్టినప్పుడు పాపాయి మొహం అమాయకంగా పసిగా ఏ భావాలూ లేని నైర్మల్యంతో ఉంటుంది. కాని వయస్సు గడిచినకొద్దీ ఆ మొహం మీద కొన్ని ముద్రలు ఏర్పడతాయి. ముఖ్యంగా టీనేజ్ ప్రారంభం నుంచి యవ్వన పరిపూర్ణత సిద్ధించేదాకా ఉండే మధ్యకాలంలో -

అంటే సుమారు 13 నుంచి 21 సంవత్సరాల మధ్య కాలంలో - మనలోని ఉద్వేగాలు మన ముఖకండరాల రేఖల్లో మార్పుల్ని తీసుకువచ్చి మన మొహపు రూపురేఖల్లో (వీటినే ఫీచర్స్ అంటాము) శాశ్వత ముద్రలు ఏర్పరుస్తాయి. ఈ రూపురేఖలే మన గత జీవితానికి 'మ్యాప్' లాగానూ, భవిష్యత్తుకు 'బ్లూ ప్రింట్' గానూ ఉంటాయి!

మీరు ఒక మనిషి కళ్ళలోకి చూడండి, అతని పెదిమలు తిప్పే వంపుల్ని చూడండి, నుదురు మీద పడ్డ గీతల్ని చూడండి, నవ్వే తీరును గమనించండి - అవి అతడి మనస్తత్వం గురించీ, ఆ సమయాన అతడి దృక్పథం గురించీ ఎంతో కొంత రహస్యాన్ని తెలియజెప్పక మానవు!

కాబట్టి బేబీ, నువ్వు ఆకర్షణకు లోనవుతున్న, నువ్వు ప్రేమలో పడబోతున్న, యువకుడి మొహాన్ని మొదట జాగ్రత్తగా గమనించు. గమనించి, అతడి ముఖ భంగిమలు వ్యక్తీకరించే ఈ కింది లక్షణాల్ని చదవటానికి ప్రయత్నించు!

★ అతడు కళ్లు విప్పార్చి చూస్తాడా, చికిలించి చూస్తాడా?

★ అతడు నేరుగా నీ కళ్ళలోకి చూస్తాడా లేక నీ చూపును తప్పించాలని చూస్తాడా?

★ అతడు మాట్లాడకుండా ఉన్నప్పుడు అతని పెదాలు గట్టిగా బిగుసుకుని ఉంటాయా లేక కొద్దిగా తెరుచుకుని ఉంటాయా?

★ అతని పెదిమల కొనలు పైకి తిరిగి ఉంటాయా లేక కిందికి వాలి ఉంటాయా?

★ అతని నోటి చుట్టూ నవ్వు గీతలు కనిపిస్తాయా లేక నుదుటి మీద కోపం గీతలు కనిపిస్తాయా?

★ అతడు పెద్దగా నోరు తెరిచి నవ్వుతాడా లేక స్వల్పంగా పెదాల్ని కదిల్చి నవ్వుతాడా?

★ అతను నీతో మాట్లాడుతున్నప్పుడు అప్పుడప్పుడూ మొహానికి చేతులు అడ్డం పెట్టుకుంటాడా? అంటే మొహం తుడుచుకుంటున్నట్లుగా.....



## కళ్లు చెప్పే కథలు!

మొదటగా ఒక మనిషి గురించి అతని కళ్ళేం చెబుతాయో చూద్దాము!



○ కళ్ళు హృదయాన్ని ప్రతిబింబిస్తాయని అనాది నుంచీ ఒక అభిప్రాయం వాడుకలో ఉంది. నిజమే కూడా! ఏ మనిషి గురించి అయినా గానీ అతని కళ్ళు ఎక్కువ రహస్యాల్ని చెబుతాయి.

○ ఇద్దరు వ్యక్తులు ఎదురు బొదురుగా ఉన్నప్పుడు మాటల ద్వారా కంటే చూపుల ద్వారా ఎక్కువ భావాల్ని మార్పిడి చేసుకుంటారు. కళ్లు బాహ్య ప్రపంచానికి ముఖద్వారాలే కాక మన అంతర్ ప్రపంచానికి రాజమార్గాలు కూడా!

○ కాబట్టి లతాంగీ, నీ పురుషుడి అంతరంగంలో ఏమి దాగి ఉందో తెలుసు కోవడానికి మొదటగా అతని కళ్ళను చదువు!

○ అతని కళ్ళలో నీ పట్ల ఆసక్తి ఉందా, నిర్లక్ష్యం ఉందా? విషాదం దాగి ఉందా, కోపం పొరలుతోందా?? మానవత్వం దాగి ఉందా, అద్భుత భావం పొదిగి ఉందా?



- ఈ సందర్భంలో నీకు వాసంతి తన బాయ్‌ఫ్రెండ్ గురించి ఏమని వాపోతోందో తెలియజేస్తాను. ఆమె అంటుంది కదా ;

"ప్రకాశ్ సంగతి నాకేమీ అంతుపట్టడం లేదు. అతను నావేపు ఆర్తిగా ప్రేమగా చూస్తాడు. అంతవరకు బాగానే ఉంది గాని నేను మాట్లాడుతున్నప్పుడు మాత్రం అతను ధ్యాస ఉంచి వినటం లేదేమోననిపిస్తుంది. నేను మాట్లాడుతున్నప్పుడతను ఎంతసేపూ గదిలో ఈ మూలకీ ఆ మూలకీ అవతల కదుల్తున్న మనుషుల వేపూ చూస్తుటాడు. ఎప్పుడో ఒకసారి నా కళ్ళల్లోకి నేరుగా చూస్తాడు గాని అది ఒక క్షణం సేపు మాత్రమే. ఎక్కువ సమయాలలో అతను నామీద కంటే నా చట్టుప్రక్కల ఉండే పరిసరాల మీద, ఇతర మనుష్యుల మీదా ఎక్కువ ధ్యాస ఉంచుతున్నాడేమో ననిపిస్తుంది. అది నిజమేనా లేక కేవలం నా అనుమానమేనంటారా?"

- పాపం అతని పట్ల అంత మక్కువను పెంచుకున్న వాసంతికి ఏమని చెప్పాలి?
- మాటిమాటికీ ఆమె నుంచి చూపుల్ని తప్పించి చుట్టుపక్కలకు చూడటం ద్వారా అతను ఆమెపట్ల తనకు నిజమైన ఆసక్తి లేదని స్పష్టంగా తెలియజేస్తున్నాడు. అతని నుంచి ఆమె ముందే జాగ్రత్త పడటం మంచిది... అదే చెప్పాను.
- మరికొన్ని విషయాలు తెలియజెప్పాక ఆమె నిజంగానే జాగ్రత్తపడి మరో యువకుణ్ణి పెళ్ళాడి ఇప్పుడు సుఖంగా కాపురం చేసుకుంటోంది.

## చూపుల్తో చూపులు కలిపే చిన్నోడు

❒ ఒక యువతి తనతో సంభాషిస్తున్నప్పుడు నేరుగా ఆమె కళ్ళల్లోకి చూసే యువకుడు ఆమె పట్ల నిజమైన ఆసక్తి కలిగి వున్నవాడై ఉంటాడు.

  - తన భావాల్ని, ఉద్వేగాల్ని ఆత్మీయంగా ఆమెకు చెప్పి మళ్ళీ ఆమె నుంచి వాటిని అందుకోవాలని చూస్తాడు. నటన ఏమీ లేకుండా నిజాయితీగా, కనీసం ఆ క్షణాన అయినా గాని తానామె పట్ల ఆకర్షితుడై ఉన్నట్లు తెలియజేస్తుంటాడు.

## అనిమేషుడు

❒ మరొక యువకుడుంటాడు, తాను ప్రేమించే యువతి వేపు రెప్పలార్చకుండా చూస్తుంటాడు. మరి అతని మాట?

  - తీరికగా ప్రశాంతంగా కళ్ళలోకి చూసే మనిషికీ రెప్పలార్పకుండా సూటిగా కళ్ళలోకి చూసే మనిషికీ మధ్య తేడా ఉంటుంది.

- రెప్పలార్పకుండా సూటిగా కళ్ళలోకి చూసే మనిషి మనల్ని శల్యపరీక్ష చేస్తున్నట్లుగా అనిపించి మనం అనీజీని ఫీలవుతాము! మనలో కలిగే ఆ అనీజీ వాస్తవబద్ధమైనదే కూడా!
- తను ప్రేమించే అమ్మాయిని అలాంటి అనీజీకి గురిచేసే పెద్దమనిషిని ఏమనాలి?!
- వన్వే ట్రాఫిక్ మహాశయుడు!
- అతడు తన గురించి ఏమీ తెలియజేయడు గాని అవతలి వాళ్ళ రహస్యాలను మాత్రం తెలుసుకోవాలని చూస్తాడు! ఒకవేళ ఆ అమ్మాయి అతనిలోని మిగతా విషయాలు నచ్చి అతణ్ణి పెళ్ళిచేసుకుందంటే త్వరలోనే ఆమె అతడు ఏ కెజిబి లోనో, ఏ సిఐఏ లోనో ఉండాల్సిన మానవుడనీ అనేక విధాలుగా అతడు తనకు 'చిక్కడు దొరకడు' అనీ అర్థం చేసుకుంటుంది.

## చూపులు కలపని శుభమనిషి

☐ అమ్మడూ, నువ్వు ప్రేమిస్తున్న యువకుడు నీతో మాట్లాడుతున్నప్పుడు నీ కళ్ళలోకి కాకుండా ఎంతసేపూ నీ భుజాలు, నీ చుబుకము, నీ మెడ, నీ నుదురు... ఇలా వేరే అవయవాల వేపు చూస్తున్నాడనుకో, అప్పుడేమనుకుంటావు?

- అతగాడు తప్పనిసరిగా నీ గురించి ఎక్కువ తెలుసుకోవాలను కుంటున్నాడు. మనిషి కొంచెం సిగ్గరి కావచ్చు. స్వయంస్పృహ కలవాడు కావచ్చు.
- ఇలాంటి కుర్రవాణ్ణి కనుక నువ్వు వలలో వేసుకుని అతడిలో ఆత్మవిశ్వాసం రాజుకునేట్లు చేయగలిగావంటే అదృష్టవంతురాలివే, సుఖపడిపోతావు. అయితే తరచుగా అతణ్ణి నువ్వు వెన్ను తట్టి అతడిలోని ఆత్మస్థయిర్యాన్ని మేల్కొలుపు తుండాలన్న సంగతిని మర్చిపోవద్దు!

## దిక్కులు చూసే రామయ్య!

☐ ఒక మనిషి కళ్ళు చికిలించి చంచలంగా అటూ ఇటూ చూస్తోంటే అతణ్ణి నెర్వస్ మనిషిగా, సందేహాలరావుగా (లేక డౌటేశ్వరరావుగా) అనుకోవాలి.

- బహుశా అతనికి జీవితం నేర్పిన పాఠాలుఎవరినీ నమ్మవద్దని చెప్పి వుంటాయి. ప్రియురాలు గానో భార్యగానో ఎప్పుడూ నిన్ను ఒక కంట

కనిపెట్టుకుని ఉంటాడతను. మీ మధ్య సంబంధం ఏమంత సజావుగా ఉండే అవకాశం లేదు.

## కన్నుగొట్టే సోగ్గాడు

❑ మరొక మరిడేశ్వరరావుంటాడు. ప్రారంభం నుంచీ నీతో చలాకీగా కులాసాగా కబుర్లు చెపుతుంటాడు. సందు చూసుకుని కన్నుకొట్టి "నువ్వంటే నాకాసక్తి" అన్న విషయాన్ని దాపరికం లేకుండా తెలియజేస్తుంటాడు.

- ○ అతనితో పరిచయం పాకానపడ్డకొద్దీ అతని కన్నుకొట్టే రహస్యమేమిటో నీకు తెలిసివస్తుంది. బహుశా అతను ఆడవాళ్ళను వలలో వేసుకునే వేణుగోపాల స్వాముడన్నా అయి ఉండాలి.
- ○ లేక నీతో మాట్లాడుతున్నప్పుడు నెర్వస్ నెస్‌ని ఫీలయి ఆ గాభరాలో గార్దభరావులా అతనికి తెలియకుండానే అతని కన్ను అలా కొట్టుకుంటూనన్నా ఉండాలి.

## కనుబొమలు

❑ కళ్లలాగే కనుబొమలు కూడా అనేక సందర్భాలలో మన మనస్సులోపలి భావాలను తెలియజేస్తాయి. ఒక మనిషి కనుబొమలు ముడిపడ్డాయంటే అతను బాధ్యతా యుతమైన ఏవో ఆలోచనలలో ఉన్నాడని అనుకోవాలి.

- ○ ముఖ లక్షణాలలో కనుబొమలు ముడివడి ఉండటం ఒక భాగమయినప్పుడు - అంటే అతడి కనుబొమలు హమేషా ముడివడిన భంగిమలో ఉంటే -అతడు తాను పెళ్ళాడబోయే లేక ప్రేమించబోయే స్త్రీని చాలా జాగ్రత్తగా ఎన్నుకునేవాడై ఉంటాడు! నిశితంగా, విశ్లేషణాత్మకంగా ఆమెను పరిశీలిస్తుంటాడు. అతను రిలాక్స్ అయి ఉండే సందర్భాలు తక్కువ కాబట్టి అతనితో ఆమె కాపురం కాస్త ఇబ్బందికరంగానే ఉంటుంది.
- ○ అయితే అతనామెకూ, ఆమెతో బంధానికీ తప్పక కట్టుబడి ఉంటాడనేది ఆశావహమైన విషయం!

❑ కనుబొమలు పైకి లేచి ఉండే పెద్దమనిషి గొప్ప ఆశావాది. ఈ ప్రపంచాన్ని ఎప్పుడూ విడ్డూరంగా (వండర్ మే థండర్ అన్నట్లుగా) వీక్షిస్తుంటాడు. ఇతరులలో మంచి గుణాల్ని మెచ్చుకుంటాడు. కొత్త విషయాల్ని తెలుసుకోవాలనే తపనలో ఉంటాడు.

- ఎక్కువసేపు అతనలా కనుబొమలు పైకిలేపి ఉంచి నీవేపు చూస్తున్నాడంటే అతను నీ సౌందర్యము, తెలివితేటల పట్ల మెచ్చుకోలుగా చూస్తున్నాడనీ, తన ఆ మెచ్చుకోలుతనాన్ని నీకు తెలియజేయాలని చూస్తున్నాడనీ అనుకోవచ్చు!
- ఒక కనుబొమను మాత్రమే పైకి లేపి చూసే మహానుభావుడు కాస్త మిస్‌చీవియస్ మనిషనీ, దేనినీ - అఖరికి స్త్రీ పురుష సంబంధాలని కూడా - నమ్మడనీ అర్థం చేసుకోవాలి. దేనినీ నమ్మని నిశిత పరిశీలకుడతను.
- నీకతని వేడి వేడి చేదు భావాలు వినోదాన్ని కలిగిస్తే బహుశా నీకతను 'విట్టీ' గా 'ఛామింగ్' గా కనిపించవచ్చు.

# 3



# నోరు, నవ్వు ఏం చెబుతాయి?

(ఎలా నవ్వుతాడో తెలుసుకోవాలంటే
ఎలా నవ్వుతాడో చూడాలమ్మాయ్!)

అందమైన అమ్మాయి,
కలవారి అమ్మాయి,
సంపాదించే స్త్రీ,
వయ్యారాల వొంపుల కుప్ప,
సుతారాల సుందరాంగి -

ఇలాంటి స్త్రీలను చూసినప్పుడు పురుషులు ప్రేమలో పడాలనే వెంపర్లటలో పడతారు. నానారకాల నాటకాలు మొదలెడతారు.

అయితే తన చుట్టూ తిరిగే అలాంటి పురుషులలో తనకు సరిజోడీ ఎవరో ఆమె ఎలా తెలుసుకోగలదు?

అతను తనను ఉల్లాస పరుస్తాడా, ఉదాసీన చిత్తుడా?

సౌమ్యవంతుడా డాన్‌జాన్ వారసుడా?

మోహితపరిచే సరసచిత్తుడా లేక బిగుసుకుని ఉండే జడాత్ముడా?

- ఈ విషయాన్ని తెలుసుకోవటం ఎలా??



ఒక మనిషి నవ్వే తీరు, అతని నోటి కండరాల విన్యాసం, పెదాల భంగిమలు, ఇలాంటివన్నీ అతడు సంభాషించే సమయంలో అతడి గురించిన రహస్య సమాచారాన్ని బయటపెడతాయి.

అలాంటివాటిని కూపీ లాగటం ద్వారా స్త్రీ అతడెలాంటివాడో తనపట్ల అతనికెలాంటి దృక్పథముందో తెలుసుకోవచ్చు!

## విశాల లాస్యం

- ఒక వ్యక్తిలో మంచి హ్యూమర్ ఉండి అతడు పెదాల్ని ఈ చివరి నుండి ఆ

చివరకు లాగి నోరంతా తెరిచి మనస్ఫూర్తిగా నవ్వుతుంటే అతనున్న గదంతా వెలిగిపోతున్నట్లవుతుంది.

- తన సంతోషాన్ని ఇతరులకు పంచటానికి సంకోచించని మనిషి అయి ఉంటాడు అతను!
- గారెలోని చిల్లును పట్టించుకోకుండా మిగతా ముక్కవైపు ఆశగా చూసే ఆశావాది అతను!
- తన ఆనందాన్ని ఎదుటివాళ్ళకు కూడా పంచాలనే తాపత్రయం గల పెద్ద మనిషి అతను!
- అతడిని ఎన్నుకునే స్త్రీ తన జీవితాన్ని ఒక నవ్వుల పువ్వుల పండగగా చేసుకుంటుంది. అయితే ఆమె కొంచెం సెన్సిటివ్ అయితే ఒకోసారి ఆమెకు అతను బోరుకూడా కొట్టవచ్చు.

**అతడిలో అది క్షమించదగ్గ అవలక్షణమే కూడా!**

## సీరియస్ సీజరు!

❑ కొందరి మొహం మీద ఎప్పుడూ సీరియస్‌నెస్ చోటుచేసుకుని సదా బిగదీసుకున్నట్లుగా ఉంటారు. అలాంటి పురుషుడి గురించి స్త్రీ ప్రారంభంలో తప్పు అంచనా వేసుకున్నా కాలక్రమాన అతనిలోని అసలు రహస్యాన్ని పసిగట్టగలుగుతుంది.

- తనలోని భావాలను ఇతరులకు కనిపించకుండా దాచుకునే పెద్దమనిషి అయి ఉంటాడతను.
- సామాన్యంగా అతను తనకు తాను సంతోషంగా ఉండే పెద్దమనిషి కాడు. అందుకనే అతనితో సంబంధాలు అతనితో జీవితాన్ని పంచుకునే స్త్రీకి కూడా ఏమంత సంతోషదాయకంగా ఉండవు.

## పెదిమల్ని పట్టించుకోరూ?

❑ నవ్వు చెప్పే రహస్యాలే కాకుండా ఎక్కువ సందర్భాలలో అతని పెదిమలు అలవాటు పూర్వకంగా సాగే భంగిమలు కూడా అతని గురించిన రహస్యాలు చెబుతూ ఉంటాయి.

- ఉదాహరణకు ఒక వ్యక్తి తరచుగా తన కింది పెదిమను కొరుక్కుంటూ ఉంటాడనుకోండి.
- అతను నెర్వస్‌గా ఉన్న మనిషి అయి ఉంటాడు. తాను చెప్పాలను

కుంటున్న విషయాన్ని చెప్పకుండా లోలోపల అణచిపెట్టుకుంటున్న వాడై వుంటాడు.

ఇప్పుడు పెదిమలకు సంబంధించిన మరికొన్ని వివిధ భంగిమలను పరిశీలించుదాము....

## తెరుచుకున్న పెదాలు

❒ ఎదుటి మనిషి మాట్లాడుతున్నప్పుడు ఒక వ్యక్తి నోరు తెరుచుకుని వింటున్నాడనుకోండి. అప్పుడు??

- అతను హృదయాన్ని విప్పి వింటున్నాడనీ, అవతలి మనిషి చెప్పే వాటిని నమ్ముతున్నాడనీ, వినాలనే తాపత్రయాన్ని ప్రదర్శిస్తున్నాడనీ అనుకోవాలి.
- తన చుట్టూ తిరిగే పురుషుడు తను చెప్పే విషయాన్ని ఇలా పెదాలు తెరుచుకుని వింటుంటే ఆమె అతను తన పట్ల ఆసక్తిని ప్రదర్శిస్తున్నాడనీ, తన గురించి ఇంకా తెలుసుకోవాలని చూస్తున్నాడనీ అనుకోవాలి.
- తన ప్రేమ గేమ్‌లో ఆమె ఒక అడుగు ముందుకు వేయవచ్చు!

## బిగుసుకున్న పెదాలు

❒ హమేషా పెదాల్ని బిగించి ఉంచే పెద్దమనిషికి మనస్సులో అనేక అభిప్రాయాలున్నాయనీ అతడు వాటి గురించి చెప్పకుండా దాచుకుంటున్నాడనీ అనుకోవాలి.

- ఇలాంటి మనుషులు లోలోపల ఉక్కిరి బిక్కిరి అవుతున్న ఉద్వేగాలతో ఎప్పుడు అగ్నిపర్వతం బద్దలవుతుందా అన్నట్లుంటారు. వీళ్ళు హమేషా మానసిక ఒత్తిడిలో నలిగిపోతూ తలనొప్పులు, అల్సర్ మొదలైన వాటితో బాధపడే అవకాశం ఉంది.
- ఇలాంటి పురుషుడితో స్త్రీ ఏమంత సంతోషంగా కాలం గడిపే అవకాశం లేదు!

## పెదిమల కొనలు పైకి లేచి...

❒ చాలా తక్కువమందే అయినా కొందరికి పెదిమల కొనలు పైకి లేచి ఉంటాయి.

- ఇలాంటి వ్యక్తి ప్రతి విషయాన్నీ ఆశ అనే భూతద్దంలోంచి చూసే గొప్ప ఆశావాది అయి ఉంటాడు.
- ఇతడిలో స్వతహా సెన్సాఫ్ హ్యూమర్ ఉంటుంది. ఇతను ఎదుటివాళ్ళను కూడా చలాకీ నవ్వులలో ముంచగలుగుతాడు కాబట్టి ఇలాంటి వ్యక్తిని చేసుకునే అమ్మాయి మహా బాగా సుఖపడిపోగలుగుతుంది.

☐ దీనికి పూర్తిగా విరుద్ధమైన వ్యక్తి పెదిమల కొనలు కిందికి వాలిపోయి ఉండే మనిషి.

○ లోకంలో ఇలాంటి వాళ్ళే అధికంగా ఉండటం విచారకరం! లోకంతో విసుగుచెందిన గొప్ప నిరాశావాదులు అయి ఉంటారు వీళ్లు.

○ ఇలాంటి వ్యక్తి కాన్ఫిడెన్సును పొందటం కష్టంగాని అలా పొందగలిగిన స్త్రీని మాత్రం అతను నెత్తిమీద పెట్టుకుంటాడు!

## పెదిమలు తడుపుతూ

☐ స్త్రీతో మాట్లాడేటప్పుడు వూరకే నాలుకతో పెదిమల్ని తుడుపుతూ ఉండే వ్యక్తి స్త్రీతో 'నువ్వు చాలా మధురంగా ఉన్నావు' అనే భావాన్ని తెలియజేస్తున్నవాడై ఉంటాడు. ఇలా పెదిమను నాలుకతో తడపటం సెక్స్ సింబల్-

○ ఇతను మాంచి సరసుడై ఉండి ఉంటాడు. ఇందులో కూడా మళ్లీ కొన్ని పద్ధతు లున్నాయి. నాలుకను పెదిమల మధ్య నుంచి చకచకా వెనక్కు ముందుకూ ఆడించడం, నాలుకను పెదిమల మధ్య నిదానంగా ఈ చివరి నుండి ఆ చివరకు కదిలించటం... ఇవి కొంత ఎబ్బెట్టు చేష్టలు! సంస్కారవతి అయిన స్త్రీ అతని పట్ల ఇష్టం లేకపోతే అవమానాన్ని ఫీలవుతుంది.

○ ప్రేమ, రొమాన్సు అవసరం లేదు, కేవలం సెక్సు చాలనుకునే స్త్రీలకు ఇతను బాగా నప్పుతాడు!

## వణికే పెదాలు

☐ నిస్పృహకు లోనయి ఉండే మనుషులకు కోపంతో మాట్లాడబోతున్నప్పుడు పెదాలు స్వలంగా కంపిస్తాయి. మనస్సులో కదిలే బలమైన ఉద్వేగపూరిత భావాల్ని కంట్రోల్ చేసుకోలేక, ఆ భావాల్ని ఇంకా బయటికి వ్యక్తం చేయకపోయి హృదయం బద్దలవటానికి సిద్ధంగా వున్నప్పుడు అందుకు సూచనగా పెదాలు వణుకుతాయి.

○ మాటిమాటికీ ఇలాంటి స్థితిలో ఉండే పురుషుణ్ణి స్త్రీ తట్టుకోవటం కొంచెం కష్టమే. అయితే ఆమె అతనిని ఒక తల్లిలా గురువులా, బుజ్జగించగలిగితే అద్భుత విజయాన్ని సాధించగలుగుతుంది.

ఇవి కాకుండా మరికొన్ని భావాల్ని వ్యక్తీకరించే మొహాల గురించి చూద్దాము:

## అరుణారుణ ముఖం

❒ కోపం వచ్చినప్పుడు లేక అవమానించబడ్డప్పుడు మనిషి మొహం ఎర్రగా కందిపోతుంది. ఇందుకు కారణం ఆ సమయంలో శరీరంలోని రక్తం మొహంలోకి తన్నుకురావటం! ఆ సమయాన సమీపంలో ఉన్నవాళ్ల మీద అతను పేట్రేగిపోయే అవకాశం ఎక్కువ ఉంటుంది.

- ఇలా మాటిమాటికీ మొహం కందిపోయే పురుషుడిని స్త్రీ భరించడం కష్టమే. ఆమె సహనవతి కాకపోతే వాళ్ల మధ్య రణ నాదాలు చెలరేగిపోయే ప్రమాదం ఉంది.

## ధృఢచిత్తుడు

❒ చుబుకం ముందుకు జరిగి, దవడ నరాలు బిగుసుకొని ఉండి, పెదిమల కొనలు కిందికి వంపు తిరిగి ఉంటే ఆ వ్యక్తిని ధృఢచిత్తుడుగా తీసుకోవచ్చు. ముస్సోలినీ, రిచర్డ్ నిక్సన్ ఈ కోవకు చెందినవాళ్ళు.

- ఇలాంటి పురుషులకు దర్పం ఎక్కువ. ఇతరులతో ఏకీభవించక తను మాటే నెగ్గాలనే పంతం ఎక్కువ. ఒకవేళ ఎప్పుడన్నా ఏకీభవించినట్లు కనిపించినా అది తను పంతం నెగ్గటానికి ఆడే నాటకం మాత్రమే అది!
- అణకువగా ఉండే స్త్రీలు ఇలాంటి పురుషుల వద్ద రాణించ గలుగుతారు!

## నునుసిగ్గులవాడు

❒ పెదాలు, కళ్ళ వెనుక చిరునవ్వులు దాగి ఉండి, చెంపలు కొద్దిగా గులాబీ రంగుకు మారి (కెంపులై) నునుసిగ్గులు ప్రదర్శించే పురుషుడు శృంగారరాయుడై, స్త్రీ చెప్పే సజెషన్స్‌కి తలవొగ్గే వాడై ఉంటాడు.

- అతనికి తెలియని శృంగార ద్వారాలు తెరవగలిగే బలమైన వ్యక్తిత్వం గల స్త్రీ అతనికి సరితగ్గ జోడీ!

## పాలిపోయిన మొహం

❒ మొహంలో రక్తం ఇంకిపోయి తెల్లగా పాలిపోయిన వ్యక్తి పూర్తిగా భయపడిపోయిన వాడైనా అయి వుండాలి, లేక తీవ్ర కోపంతో ఉన్నవాడైనా అయి ఉండాలి. ఆ సమయాన అతడి మొహంలోని రక్తం శరీర కండరాల లోకి పరుగుదీసి అతడిని పారిపోవటానికో, పోరాడటానికో సిద్ధం చేసి ఉంటుంది.

○ ఇలాటి స్థితిలో ఉన్న వ్యక్తితో హేతుబద్ధంగా వాదనలు పెట్టుకోబూనటం శుద్ధ అవివేకం. పక్కకు తప్పుకుపోవటం మంచిది.

## ముక్కుపుటాలెగరేసేవాడు

❑ చిన్న చిన్న విషయాలకే త్వరగా ఉద్రిక్తత చెందే పురుషుడు మనిషి మాటి మాటికీ ముక్కుపుటాలను ఎగరేస్తుంటాడు. రౌద్రానికి సూచన ఇది.

○ తీవ్రమైన ఉద్వేగజీవి ఇతను. తరచు మూడీగా ఉంటాడు. తన భావాలను దాచుకోవటానికి ఏ మాత్రమూ ప్రయత్నించడు. పైగా వాటిని ఎదుటివాళ్ళకు తెలియజేయడానికి కూడా సిద్ధంగా ఉంటాడు.

○ ఇలాంటి వ్యక్తి ఉండి ఉండి గభాల్న కోపంతో మండిపోతాడు. అంతలోనే చల్లారి పోతాడు. ఏ స్త్రీతోనయినా అతను ప్రేమ జ్వాలలో లేక మోహజ్వాలలో తగుల్కొన్నాడంటే తుఫానులా ఆమెను ఉక్కిరి బిక్కిరి చేస్తాడు.

## వంకరలు తిరిగే మొహం

❑ తనలోని భావాలను అణచుకుని నెర్వస్‌గా ఉండే మనిషి మొహం వంకరలు తిరిగినట్లుగా కనిపిస్తుంది. మొహంలోని ప్రతి భాగమూ ఎంతో కొంత అసలు రూపాన్ని మార్చుకున్నట్లుగా కనిపిస్తుంది. న్యూరోటిక్ మనిషి అతను!

○ అతని అవసరాలు, కోర్కెలు తీర్చటానికి సిద్ధపడితే తప్ప ఏ స్త్రీ గానీ అతని జోలికి పోకుండా ఉండటమే మంచిది.

❑ పురుషుడు తన చుట్టూ తిరుగుతున్నప్పుడు విడివిడిగా అతని మొహంలో ఒక్కో భాగాన్ని పరిశీలించటం కాకుండా జమిలిగా అతను తన చూపుల్ని ఏ దిక్కుకు ప్రసరిస్తున్నాడు, కనుబొమల్ని ఎలా కదిలిస్తున్నాడు, ఏ సందర్భంలో ఎంత త్వరగా నవ్వగలుగుతున్నాడు, అతని పెదిమల పొజిషన్ ఎలా ఉంది లాంటి వన్నీ నిశితంగా గమనించి అతని గురించి ఒక అభిప్రాయానికి రావటం మంచిది.

ఇప్పుడిక అతను ధరించే దుస్తులు అతని గురించిన ఏమి మర్మాలు చెబుతాయో చూద్దాము.

# 4



# వస్త్రధారణ ఏం చెబుతుంది?

(కట్టే బట్టను చూసి కట్టూ 'బొట్టు'కు ఎన్నికో!)

దుస్తుల్ని మనుషులు తయారుచేస్తారు. కాని దుస్తులు మనుషుల్ని తయారు చేస్తాయన్న సంగతి చాలామందికి తెలియదు!

మనం ఒక మనిషిని చూడగానే, అతను ధరించిన దుస్తులు అతనెలాంటివాడో మనకు చెప్పేస్తాయి. అతని వ్యక్తిత్వం ఎలాంటిదో, ప్రేమికుడుగా అతని లక్షణాలేమిటో లాంటి విషయాలను కూడా తెలియజేస్తాయి......

**(వింటున్నావా వినయవతీ?)**

తన స్వంత స్టయిల్‌లో దుస్తుల్ని ట్రిమ్‌గా ధరించే వ్యక్తి ఎప్పుడూ అమ్మాయిలకు ఆకర్షణీయంగా కనిపిస్తాడు. స్వతహా అతను అందగాడు కాకపోయినా గానీ!

అదే రకంగా ఒక వ్యక్తి ఎంత అందగాడు అయినా కూడా సరయిన దుస్తుల్ని ధరించకపోతే అమ్మాయిల్ని ఆకట్టుకోలేడు. అమ్మాయిలకు కూడా అంత అందంగా ఉండే అతను తనను ఎందుకు ఆకర్షించలేకపోతున్నాడో అర్థం కాదు!

యువకులకు సంబంధించిన ఒక అదృష్టమేమిటంటే యువతులంతా ఒకే రకమైన వస్త్రధారణకు సమ్మోహితులు కాకపోవటం!

ఒకమ్మాయికి ఒంటికి అంటిపెట్టుకుని ఉండే బిగుతు దుస్తులు ధరించిన యువకుడు ఆకర్షణీయంగా కనిపించితే, మరో అమ్మాయికి వదులుగా ఉండే బాగీ పాంటు, షర్టు ధరించిన యువకుడు ఆకర్షణీయంగా కనిపించవచ్చు.

మరో స్త్రీకి కవుల్ని స్ఫురణకు తెచ్చే బిగుతు పైజామా, వదులు లాల్చీ (రాజేష్‌ఖన్నా స్టయిల్) ధరించిన యువకుడు అందంగా కనిపించవచ్చు.

ఇప్పుడు ఒకో వస్త్రధారణలో ఒకో పురుషుడు ఏ రకమైన వ్యక్తిత్వాన్ని వ్యక్తపరుస్తూంటాడో తెలుసుకుందాము.

మొదటగా దుస్తుల విషయంలో ఉండే దృక్పథాలు ఆయా వ్యక్తుల గురించి ఏమి చెబుతాయో చూద్దాము.

## చిందరవందరగా పడేసి ఉంటే...

❒ ఒక యువతి తను ప్రేమించే లేక తనను ప్రేమిస్తున్నానంటూ తన చుట్టూ తిరిగే యువకుడి గదికి వెళ్ళిందనుకుందాము, అప్పుడామెకు అతని దుస్తులు గదిలో ఈ మూల నేలమీద పడేసి ఒకటి, మంచం మీద ఒకటి, కుర్చీకి తగిలించి ఒకటీ ఇలా అడ్డదిడ్డంగా చిందరవందరగా కనిపిస్తాయి. అప్పుడతని గురించి ఆమె ఎలాంటి అభిప్రాయానికి రావచ్చు?

○ అతను యథాలాపంగా ఉండే మనిషి! కొంచెం బాధ్యతారహితంగానూ ఉండేవాడు కావచ్చు. కానీ జీవితం పట్ల ఆసక్తి కలవాడు, జీవితాన్ని తేలికగా తీసుకునే వ్యక్తి అయివుంటాడు కూడా!

## అతి నీట్‌గా ఉంటే...

❒ దుస్తుల్ని అతి నీట్‌గా ఉంచే యువకుడు-అంటే హాంగర్‌కి తగిలించే వాటిని హాంగర్ తగిలించీ, విడిచేసిన వాటిని ఓ పక్క ప్రత్యేకంగా ఉండే చెక్కపెట్టెలో కనిపించకుండా పడేసి ఉంచీ, చూపరులకు నీట్‌నెస్‌ని ప్రదర్శించేవాడు -

○ మొండి మనిషి కావచ్చు, అతడి అభిప్రాయాన్ని మార్చటం గానీ, అతడి హృదయానికి చేరువ కావటం గానీ కొంత కష్టసాధ్యమైన విషయమే!

## సదా సిద్ధంగా ఉంచితే...

❒ చొక్కా గుండీలు ఊడిపోవటం, చిరుగులు లాటి వేమీ లేకుండా తనకున్న దుస్తుల్ని వేసుకోవటానికి ఎప్పుడూ సిద్ధంగా ఇస్త్రీ మడతలతో రెడీగా ఉంచితే -



- ఆ వ్యక్తి బాధ్యతల్ని స్వీకరించేవాడూ కమిట్‌మెంట్స్‌కి కట్టుబడి ఉండేవాడూ అయి ఉంటాడు.

## దుస్తుల్ని తనకు తాను రిపేరు చేసుకునేవాడు...

- అతని దుస్తుల్లో దేనికో ఒకచోట కుట్టు వూడిపోయి వుండవచ్చు. గుండీ తెగిపోయి ఉండవచ్చు లేక ఏ కొద్దిగానో చిరిగీ ఉండవచ్చు, అప్పుడతను -
  - వాటిని రిపేరు చేయమంటూ ఇంట్లో వాళ్లకో, టైలర్‌కో అప్పజెప్పే మనిషయితే అతను తన పరిధిలేమిటో తెలిసినవాడయి వుంటాడు.

అవసరమయి నప్పుడు నిపుణుల సలహాలు తీసుకోవటానికి ఏ మాత్రం సందేహించడు.

- అలాకాక తనకు తాను కుట్టుకోవటమో, రిపేరు చేసుకోవటమో చేసేవాడు అయితే తన గురించి తాను జాగ్రత్తలు తీసుకోగలిగే స్వతంత్ర వ్యక్తిత్వం కలిగినవాడు అయి వుంటాడు. అతడిని పెళ్లాడిన స్త్రీ కొంత స్వతంత్రాన్ని ప్రదర్శించినా గానీ ఏ మాత్రం అభ్యంతర పెట్టడు. ఆడవాళ్ళకు అతను మంచి ఛాయిస్!

## డ్రెస్సు ఎన్నాళ్ళపాటు వేస్తాడు?

❐ ఒక డ్రస్సును వూరికే రోజుల తరబడీ వేయకుండా ఒకరోజు రెండు రోజులు మాత్రం ధరించి ఆ వెంటనే ఇస్త్రీకి పంపేవాడు -

- స్త్రీకి తను నప్పుతున్నాడా లేదా అని తెగ తాపత్రయ పడేవాడు అయి వుంటాడు.

❐ అలా కాకుండా ఒకసారి ఇస్త్రీ చేసిన దుస్తుల్ని మైలపడ్డాయో లేదో చూసుకోకుండా రోజుల తరబడీ వేసుకునే యువకుడు -

- తన గురించి తాను పట్టించుకోనివాడు, స్త్రీల అభిప్రాయాలకు పెద్ద ప్రాధాన్యత ఇవ్వనివాడూ అయి ఉంటాడు. అంతేకాదు, ఆమెకు తను అందంగా కనిపించితే ఏమిటి, కనిపించకపోతే ఏమిటి అనే నిర్లక్ష్య ధోరణిలోనూ ఉంటాడు.
- స్త్రీ వైపు నుంచి చూసినప్పుడు ఇది అంత వాంఛించ దగ్గ ధోరణి కాదు!

## దుస్తుల అమరిక

### *వార్డ్‌రోబ్‌లో అతను దుస్తుల్ని ఎలా వేలాడదీస్తాడు?*

❐ రంగులవారీగా, పొడుగు చేతుల షర్టులు ఒక పక్క ఆ తర్వాత హాఫ్ షర్టులు, ఆ పక్క ప్యాంట్లు, ఈ రకంగా ఓ పద్ధతి ప్రకారమా? లేక పద్ధతీ పాడూ లేకుండా అన్నిటినీ ఎలా పడితే అలా ఒక దాని ప్రక్కన ఒకటి హ్యాంగ్ చేసి ఉంచుతాడా?

- దుస్తుల్ని ఒక పద్ధతి ప్రకారం నిలవ వుంచుకునే వ్యక్తి బరువు బాధ్యతల్ని స్వీకరించ గల్గేవాడయి ఉంటాడు. జీవితం విషయంలోనూ, ప్రేమ విషయంలోనూ నిదానాన్ని పాటించేవాడయి ఉంటాడు.

- అలా కాక దుస్తుల్ని ఒక పద్ధతి లేకుండా చేతికందిన చోటల్లా దేన్ని పడితే దాన్ని హాంగ్ చేసి ఉంచేవాడు ప్రేమ విషయంలో ఒక నిలకడ లేకుండా తన చిత్తం వచ్చినట్లుగా అమ్మాయిలతో ఆడుకునేవాడయి ఉండవచ్చు. ఒక అమ్మాయి అతడేదో తనను ప్రేమిస్తున్నాడనుకుంటుండగానే 'చిక్కడు దొరకడు' లా అతను మరో అమ్మాయితో సరాగాలు సాగిస్తుండవచ్చు....

## ఎన్ని జతల పాదరక్షలున్నాయి?

***ఒక మనిషి మేస్టేన్ వేసే పాదరక్షల్ని బట్టి అతని బుద్ధి ఏపాటిదో గ్రహించవచ్చు!***

❐ ఒక వ్యక్తి అనేక జతల పాదరక్షల్ని ఉంచుకుని ఇవాళొకటి, రేపు మరొకటిగా ధరిస్తుండవచ్చు. అలాగే మరో వ్యక్తి ఒక్క జతను మాత్రమే ఉంచుకుని అవి పాడయిపోయేదాకా రోజూ వాటినే వాడుతుండవచ్చు, అలాంటప్పుడు-

- అనేక పాదరక్షలు కలిగి ఉండి రోజుకో పాదరక్షను విలాసవంతంగా ధరించే వ్యక్తి అభిరుచుల్ని సంతృప్తిపరచటం గానీ, అతణ్ణి పట్టుకోవటం గానీ, అతడితో జీవించే లేక జీవించాలనుకునే స్త్రీకి కొంచెం కష్టసాధ్యమే అవుతుంది.
- చంచల మనస్కుడతను. పూర్వజన్మలో ఏ నవాబుగారబ్బాయినో అన్నట్లు అతను దారేపోయే సీతాకోకచిలుకల వేపు అదే పనిగా దృష్టి సారించే అవకాశం ఉంది.
- చిరిగిపోయేదాకా ఎప్పుడూ ఒకే పాదరక్షల్ని వాడే వ్యక్తి డబ్బుల విషయంలోనూ ప్రేమ విషయంలోనూ పరిమిత ఖర్చును ప్రదర్శిస్తుంటాడు. జీవితంలో అతను ఒకే స్త్రీకి కట్టుబడి ఉండి ఆ సంబంధాన్ని నిజాయితీగా అంటిపెట్టుకుని ఉంటాడు.

☛ ఇక్కడ అమ్మాయిలు ఒక సంగతిని గమనించాలి. పురుషులకు సంబంధించి ఈ చెప్పే ఏ ఒక్క లక్షణాన్నీ ప్రామాణికంగా తీసుకుని అతడి గురించి గభాల్న ఒక అభిప్రాయానికి రాకూడదు.

అతనికి సంబంధించి ఇంతవరకూ చెప్పినవి గానీ ముందు ముందు చెప్పబోయేవి గానీ అనేకానేక మిగతా లక్షణాల్ని కూడా పరిగణనలోకి తీసుకుని మాత్రమే సంపూర్ణమైన అంచనాకి రావాలి!

దుస్తులు ధరించే ధోరణిని పక్కన పెడితే -

ఒక వ్యక్తి ధరించే దుస్తుల వర్ణాలు అతడిలోని టెంపరమెంట్‌ని, మూడ్‌ని బయట పెడుతుంటాయి. ఇప్పుడు ఆ వర్ణాలు చెప్పే వివరాలేమిటో చూద్దాము.

## తెలుపు

❒ తెలుపు వర్ణాన్ని మనవాళ్ళు స్వచ్ఛతకు సూచనగా చెబుతారు. తరచుగా తెల్లటి దుస్తుల్ని ధరించే వ్యక్తి సంప్రదాయక భావాలు కలిగినవాడై ఉంటాడు. స్త్రీతో కూడా అతను సంప్రదాయికంగా ఆమెకు కట్టుబడి ఉంటాడు.

❒ అయితే కొన్ని సందర్భాలలో స్త్రీకి అతను కొంత మొండిగా, గిజినపట్టు మనిషిగా కూడా కనిపించవచ్చు కాని ఆమె పట్ల అతను నిజాయితీగా ఉంటా డనేందుకైనా ఆమె సంతోషించవచ్చు!

## నలుపు

❒ అధికంగా నల్లదుస్తులలో కనిపించే వ్యక్తి మూడీ మనిషి కావచ్చు. ఆ మూడ్స్ కూడా నెగిటివ్ ధోరణిలో ఉండి అతనితో జీవించే స్త్రీకి తరచుగా చికాకును కలిగించుతాయి.

## ఎరుపు

❒ సజీవత్వానికి చిహ్నం ఈ రంగు! ఈ రంగు దుస్తుల్ని ధరించే మనిషి మిడిసిపడుతూ అగ్రెసివ్‌గా ఉత్తేజితంగా ఉంటాడు. హమేషా అతను తన జీవితానికి ప్రేరణ కలిగించే స్థితిగతుల కోసం అన్వేషిస్తూ తన స్త్రీ పట్ల సమ్మోహిత పూరితంగా ప్రవర్తిస్తాడు. ఆమె కూడా అతని పట్ల సమ్మోహితంగా ఉండగలిగితే ఒకరికొకళ్ళు సరిజోడీ అవుతారు. అతనిపట్ల అనాసక్తి ఉంటే మాత్రం ఆమె జీవితం విరక్తి పూరితం కావచ్చు!

## నీలం

❒ స్వతహా నెమ్మదస్తుడు, ప్రశాంత చిత్తుడూ ఈ వర్ణాన్ని అభిమానిస్తాడు, ఈ రకం దుస్తుల్ని ధరించుతాడు. అతడి ప్రశాంత నైజం అతడితో జీవితాన్ని పంచుకునే స్త్రీకి ఒక వరం లాంటిది. ఆమె జీవితం ఒడిదుడుకులు లేకుండా ప్రశాంత గోదావరిలా సాగిపోతుంది.

## ఆకుపచ్చ

❒ ప్రకృతి వర్ణం! నూతనత్వానికి చిహ్నం!! సాహసాల పట్ల, అవుట్‌డోర్ రొమాన్స్ పట్ల ఆసక్తి కలిగి ఉండే స్త్రీకి ఈ దుస్తుల్ని ధరించే పురుషుడు ఆదర్శ జోడీ!

## పసుపు వర్ణం

□ ఈ దుస్తుల్ని ధరించే వ్యక్తి కల్మషరహితుడు, మానవత్వం పట్ల గౌరవం కలిగిన వాడూ అయి వుంటాడు. తన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలనే తాపత్రయం కలవాడై ఉంటాడు. అతడితో జీవితాన్ని పంచుకునే స్త్రీ అతడిని పూర్తిగా నమ్మవచ్చు!

ఇక్కడొక విషయం -

- ఏ మనిషీ ఎప్పుడూ ఒకే రంగు దుస్తుల్ని ధరించడు! వెరైటీ కోసమైనా గానీ రకరకాల వర్ణాలలో దుస్తుల్ని వేసుకుంటాడు. అయితే మరి అతని దుస్తులలో ఏ వర్ణాన్ని లెక్కలోకి తీసుకోవాలి?
- అతను ధరించే దుస్తులలో ఏ రంగు ఎక్కువ డామినేట్ చేస్తోందో పరిశీలించాలి. ఆ రంగును బట్టి అతని అభిరుచి ఏమిటో, ఆ అభిరుచి వెనుక ఉండే అతని మనస్తత్వం ఏమిటో, అతను తనకు ఏ రకంగా సరిపోతాడో సరిపోల్చుకోవాలి.

*వింటున్నారా అమ్మాయిలూ?...*

# 5



## ఫ్యాషను, నడక ఏం చెబుతాయి?

(మీరు ప్రేమిస్తున్న యంగ్‌మేన్ ఒకసారి సోగ్గాడిగా కనిపించి,
కను మూసినా తెరిచినా మీ ముందు అతడే ప్రత్యక్షమవుతూ,
మరొక రోజు మాసిన గెడ్డంతో, నలిగిన దుస్తులతో కనిపిస్తే...?
చిరాకు పడతారా? కలవరపడతారా? అతణ్ణి ఎలా అర్థం చేసుకోవటం
అన్న సందేహంలో పడితే...
ఇదుగో- ఈ అంశాలు ఒక్కసారి గుర్తు చేసుకోండి-)

ఒకప్పుడు మగవాడు దుస్తుల పట్ల శ్రద్ధ వహించి షోకిల్లాగా తయారయితే సమాజం అతడిని కొంత చులకనగా చూసేది. కాని నేడలా కాదు, రాను రాను సభ్య సమాజం ఆడవారిలాగే మగవాళ్ళు కూడా దుస్తుల పట్ల, శరీరాకృతి పట్ల శ్రద్ధ వహించాలని కోరుకుంటోంది.

ఈ విషయంలో ఏ పురుషుడన్నా నిర్లక్ష్యం వహించితే అతడి ఆలోచనలను సందేహించటమూ జరుగుతోంది. దానా దీనా నేటి ఆధునిక పురుషుడు ఫ్యాషన్లకు సంబంధించి కొన్ని ఒత్తిడులకు లోనవుతున్నాడు. అయితే శతాబ్దాల తరబడి స్త్రీ పొందిన ఒత్తిడులతో పోల్చి చూస్తే ఇదేమంత లెక్కలోకి రాదన్నది వేరే విషయం!

ఇప్పుడు పురుషుడు ధరించే దుస్తుల ధోరణి అతడిలోని 'ప్రేమారావు' ను ఏ రకంగా బయటపెడుతుందో చూద్దాము.

## అతి ట్రిమ్‌గా ఉండే రాకేశుడు

❒ ఒక యువకుడు మడత నలగని ఇస్త్రీ బట్టలతో ట్రిమ్‌గా తయారవుతాడు. బయటికి రాబోయే ముందు సెంటు స్ప్రే చేసుకుంటాడు. ఒకటికి నాలుగుసార్లు అద్దంలో చూసుకొని అడదాని కంటే మిన్నగా టక్‌నీ, మడతల్నీ సరిచేసుకుంటాడు. బయటికి వచ్చి తన కోసం ఎదురు చూస్తున్న స్నేహితురాల్ని 'హాయ్' అంటూ గ్రీట్ చేస్తాడు.

ఇతనెలాంటి ప్రేమికుడు కావచ్చు?

- తనెలా కనిపిస్తున్నాడనే అంశం కోసం డబ్బునీ, శ్రమనీ, సమయాన్నీ వెచ్చించగలిగే పురుషుడు తను ప్రేమించే స్త్రీ కోసం కూడా ఈ మూటినీ ఖర్చు చేయగలుగుతాడు.
- నీట్‌నెస్ కోసం, తీర్చిదిద్దటం కోసం, అతనిచ్చే ప్రాముఖ్యత - మాట నిలబెట్టుకునే విషయంలో కూడా అతను అంతరాత్మ బద్ధుడై ఉంటాడనే విషయాన్ని తెలుపుతుంది.

అయితే ఒకటి, స్వయంసౌందర్యం కోసం అతను పడే 'అతి' తాపత్రయం అతనికి సంబంధించిన రెండు నెగటివ్ విషయాల్ని కూడా తెలుపుతుంది.

1. అతను ఇతరులతో సంబంధాల విషయంలో 'కూల్' గా, యధాలాపంగా ఉండవచ్చు. పర్‌ఫెక్షన్ (పరిపూర్ణత) కోసం పడే అతి తాపత్రయం అతనికి తనమీద

తనకున్న తక్కువ అభిప్రాయాన్నీ, స్వయం విమర్శనా తత్వాన్నీ తెలియజేస్తుంది.

2. స్వయంసౌందర్య స్పృహలో కొట్టుమిట్టాడే మనిషి తను ప్రేమించే అమ్మాయి విషయంలో కూడా అదే రకపు నీట్‌నెస్‌ని ఆశిస్తాడు. ఆ విషయంలో ఆమె ఏనాడన్నా ఏ కారణం వల్లనైనా బద్ధకించితే ఆమెకు తనపట్ల ప్రేమ తగ్గింది గావునని అనుకునే అవకాశం ఉంది. అంతే కాదు, ఆమె నుంచి ఎడంగా జరిగే ప్రమాదమూ ఉంది!

## ఫ్యాషన్స్‌ని పట్టించుకోనివాడు!

❒ మరో యువకుడుంటాడు, అతను సమాజంలో మారిపోతుండే ఫ్యాషన్స్‌ని పట్టించుకోడు. ఎప్పుడూ ఒకే రకంగా ఏ టీ షర్టునో జీన్స్ దుస్తుల్నో ధరిస్తూ తన అప్పియరెన్స్ విషయంలో పెద్దగా మార్పును ప్రదర్శించడు.

ఇతనెలాంటి ప్రేమికుడు మహాశయా?

- ఇతనిది కొంచెం టీనేజ్ మనస్తత్వం! మూడీగా ఉండే విప్లవాత్మక తత్వం. బుద్ధి పుట్టినప్పుడు తన పక్కన ఉండే అమ్మాయిని నవ్వులు కేరింతలతో ఆకాశ వీధుల్లో విహరింపజేస్తాడు. తిక్క పుట్టిందంటే ఆమె ననలు లెక్కచేయడు. ఆ అమ్మాయి అతగాడిని మార్చాలని ప్రయత్నించినా, అతడి నుంచి ఏదన్నా కోర్కెను కోరినా ఇష్టం లేకపోతే టీనేజ్ కుర్రవాడిలా తీవ్రచూపుల్తో తిరస్కరిస్తాడు.

## నిర్లక్ష్య నిరంజనుడు

❒ మరో రకం యువకుడుంటాడు. తను ప్రేమించే అమ్మాయితో షికార్లు కొడుతున్నప్పుడు ఒకసారి నున్నటి గడ్డంతో, పెళపెళలాడే అందాల దుస్తులతో సొగసు పురుషుడిలా కనిపిస్తే మరోసారి సరిగ్గా గడ్డం చేసుకోకుండా నలిగిన దుస్తులతో అప్పుడే నిద్రలేచిన వాడిలా బద్ధకంగా బయల్దేరవచ్చు.

ఇతడి గురించి అమ్మాయి ఏమనుకోవాలి?

- ఇతను కొంచెం స్వార్థచిత్తుడు, ఎంత సేపూ అతనికి తన ఉద్వేగాలు, తన ఫీలింగ్సే ముఖ్యమైనవిగా కనిపిస్తాయి గాని ఎదుటివాళ్ళ ఉద్వేగాల్ని పట్టించుకోడు.
- అతడిని ప్రేమించే అమ్మాయి అతడు కోరుకునే ప్రేమను, ఆదర్శాన్నీ అతడికి అందిస్తే ఆమె పట్ల నిజాయితీగా ప్రేమగా ఉంటాడు.

- అలాకాక ఆమె "నువ్వు ఫలానా సమయంలో గడ్డం చేసుకోలేదు. నీ పక్కన రావటానికి నాకు సిగ్గేసింది" లాంటి సణుగుళ్లు ప్రారంభించిందంటే 'నువ్వెంత, నీ కతెంత, పో!' అనే ధోరణిలో ఆమెను లెక్కచేయడు.
- ఆడపిల్లకు అతనితో వ్యవహారం కొంచెం ఇబ్బందికరంగానే ఉంటుంది.

## ఉంగరాల గింగరాలవాడు

❒ కొందరు యువకులుంటారు, మెడలో సన్నటి గొలుసు వేలాడుతుంటుంది. (దానిని కాలరు బయటికి వేలాడవేసి నలుగురికీ కనిపింజేయాలనీ చూస్తారు) అలాగే చేతికి ఉంగరం ఉంటుంది. తరచుగా దానిని వేలి మీద అటూ ఇటూ తిప్పుతుంటారు. 'నన్ను చూడు నా నగలు చూడు, నా దర్పం చూడు' అన్నట్లుగా మనల్ని తమ ఆభరణాలతో ఆకట్టుకోవాలని చూస్తారు.

ఇలాంటివాళ్ళు ఎలాంటి ప్రేమికులు మహాత్మా?

- ఇతని బుద్ధికి డబ్బు అత్యంత ప్రాధాన్యమైనదని అర్థం చేసుకోవాలి. ఆ విషయాన్ని దాచుకోవటానికి కూడా పెద్దగా ప్రయత్నించడు. చాలా సూటి ప్రేమికుడితను.
- "ఇదిగో నేను డబ్బుల్ని ప్రేమిస్తాను. నా డబ్బూ డాబూ ఇదీ! మరి నీ మాటేమిటి?" అనే ధోరణి ప్రియురాలి వద్ద కూడా ఉంటుంది.
- ఏమంత ఎమోషనల్‌గా ఉండడితను. మరో డబ్బున్న అమ్మాయి కనిపిస్తే చాలా కాజువల్‌గా అంతకు మునుపటి ప్రియురాల్ని వదిలేసి ఆమె వైపు మొగ్గగలడు.
- ఇతడికి డబ్బు జబ్బుగా చెప్పుకోవచ్చు. ఆడపిల్లకు కూడా అదే రకమైన జబ్బుంటే ఆమె అతనివైపు మొగ్గవచ్చు. అతడినుంచి ఆమెకు డబ్బు లభించవచ్చేమో గాని ప్రేమ విషయం మాత్రం సందేహమే! పైకి ప్రేమ కనిపించినా కూడా అది డబ్బుతో ముడివేసుకుని ఉండే ప్రేమే అవుతుంది....

## నడకల నాణ్యత

ఇక మనుషుల నడకల విషయానికి వద్దాము.

❒ ఒక మనిషి నడిచే తీరు ఆ వ్యక్తి దృక్పథాన్ని, అంతకు మునుపు జీవితంలో అతను చవిచూసిన ఒడిదుడుకుల్నీ తెలియజేస్తూ అతడి క్యారెక్టర్‌ని వెలి జూపుతుంది.

❒ ఒక అమ్మాయి తను ప్రేమించే లేక ప్రేమించాలనుకుంటున్న యువకుడితో షికారుకు వెళ్ళిందనుకుందాము. ఆ సమయంలో అతడు నడిచే పద్ధతిని బట్టి ఆమె అతడి మనస్తత్వాన్ని తెలుసుకుని తనాతనితో మరింత ముందుకు వెళ్ళాలో వద్దో నన్న విషయంలో ఒక నిర్ణయానికి రావచ్చు.

## ఆమె కంటే నిదానంగా నడిస్తే

❒ ఒక యువకుడు తను ప్రేమించే అమ్మాయి కంటే గబగబా ముందుగాని ఆమెకంటే నెమ్మదిగా గానీ నడుస్తున్నాడనుకోండి-

- అతడు ఆమె అవసరాల్ని పట్టించుకోని వాడని అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు, ఆమె మీద తన ఆధిక్యాన్నీ, కంట్రోల్‌నీ ప్రదర్శించ జూస్తున్నాడనీ అనుకోవచ్చు.
- ఇంకా అతనితో పెళ్ళికాక, సంబంధమేమీ శృతి మించకపోతే ఆ అమ్మాయి అతనితో 'నాయనా నీకో నమస్కారం!' అని చెప్పేయటం ఉత్తమం.

## గూళ్లు బిగబట్టి నడిస్తే

❒ తల వేలాడేసి గూళ్లు బిగబట్టి ఎంతో బరువును మోస్తున్నట్లు నడిచే యువకుడు జీవితంలో నిరాశా నిస్పృహలను చవిచూసినవాడని అర్థం చేసుకోవాలి.

- జీవితం పట్ల అతనికుండే నెగటివ్ దృక్పథం అతడితో జీవితం పంచుకోవాలనుకునే స్త్రీని చికాకు పరిచే అవకాశం ఉంది. అయితే ఆమె కూడా అతనిలాగే బరువు బాధ్యతల్ని మోస్తున్న స్త్రీ అయితే అతనామెకు సరి జోడీ!
- టెంపరమెంట్‌తో, తలతిక్కగా ప్రవర్తించే యువకుల కంటే ఇతను ఉత్తమం! తాను ప్రేమించే స్త్రీలోని సహనసౌశీల్యాలను ప్రశంసిస్తాడితను. ఆమె మీద ఆధారపడి ఉండటానికీ ఇష్టపడతాడు.

## జేబుల్లో చేతులు పెట్టుకుని

❒ కొందరు జేబుల్లో చేతులు పెట్టుకుని నడుస్తుంటారు. ఇది ఒకప్పుడు స్టయిల్‌గా కనిపించినా వాస్తవానికి ఇలా జేబుల్లో (పంట్లాము) చేతులు పెట్టుకుని నడవటం తన అతిముఖ్యమైన జననేంద్రియ భాగాల్ని కాపాడుకోవటానికి చేసే ప్రయత్నం.

- తన భావాల్ని తనలోనే దాచుకునే మనిషి అయి ఉంటాడితను. ఇతరుల

మనస్సుల్ని స్పృశించటానికీ వాళ్ళ భావాల్ని తెలుసుకోవడానికీ ప్రయత్నించడితను.

- ఇతడితో జీవితాన్ని పంచుకోవాలనుకునే స్త్రీ ముందుగా తన గురించి అతనికి నమ్మకం కలిగించటానికి చాలా పాట్లు పడాల్సి ఉంటుంది.

## పిడికిళ్లు బిగించి

☐ నలుగురిలో నిలబడి ఉన్నప్పుడు గానీ నడుస్తున్నప్పుడు గానీ కొందరి పిడికిళ్లు గట్టిగా బిగుసుకుని ఉంటాయి.

- ఇలాటి మనిషి నెర్వస్ మనిషి అనీ లోకం మీద ఎంతో కక్ష ఉన్నవాడనీ అర్థం చేసుకోవాలి. ఇతడు తనలోని నిరాశా నిస్పృహల్నీ, తన బరువు బాధ్యతల్నీ తనతో జీవితం పంచుకునే స్త్రీ మీద మోపే ప్రమాదం ఉంది. కాబట్టి అమ్మాయిలు ఒకటికి రెండుసార్లు ఇతని గురించి పునరాలోచించటం మంచిది!

# 6



# షికారు చందస్సు

## (ప్రేమచందం తెలుసుకోవాలంటే షికారు చందస్సు చదవాలి! మీ తొలి షికారు సినిమా హాలుకా? సీదా హోటలుకా?)

తొలి పరిచయం - తొలి షికారు!!

యువతీ యువకుల ప్రేమారోహణ మార్గంలో ఈ రెండూ మొదటి రెండు మెట్లుగా ఉంటాయి.

'**తొలి పరిచయం**' లో ఒకరినొకళ్ళు స్టడీ చేయడానికి పెద్దగా అవకాశాలుండవు. ఎందుకంటే స్త్రీ పురుషుల మధ్య సానుకూల పరిస్థితులేవో దోహదం చేసినప్పుడు తొలి పరిచయం జరుగుతుంది. ఆ పరిచయం జరిగిన వెంటనే వాళ్లు విడిపోవచ్చు లేక కొంతసేపు కలిసే ఉండవచ్చు. ఎవరికి వాళ్ల రిజర్వేషన్స్ ఉంటాయి కాబట్టి ఆ కాస్త వ్యవధిలో ఇరువురూ కొంత గుంభనంగానే ఉంటారు.

కాని '**తొలి షికారు**' విషయం అలా కాదు. ఇద్దరికీ కొంత ఏకాంతం ఉంటుంది. ఒకరినొకళ్లు ఆకర్షించుకోవాలనే తాపత్రయం ఉంటుంది. అదే సమయంలో తమకు తెలియకుండానే తమ తమ వ్యక్తిత్వం, మనస్తత్వాలను కొంత బయటపడేసుకుంటారు.

ఇదుగో, ఈ అంశాన్నే ఇప్పుడు చెప్పబోతోంది-

అయితే అమ్మాయికి సంబంధించి కాదు, అబ్బాయికి సంబంధించి-



అవధరించుడు...

మైడియర్ మెర్రీ పాపాయీ!

తొలి షికారుకు వెళ్దామనుకున్నప్పుడు మీరిద్దరూ ఎక్కడికి వెళ్ళాలి, ఏం చేయాలి అన్న విషయంలో కొద్దిసేపు చర్చించుకోక తప్పదు. ఆ సమయంలో అతడు ఏమి ప్రపోజల్ చేస్తాడు, ఎలా ప్రపోజ్ చేస్తాడు అన్న దానిని బట్టి అతని మనస్తత్వం కొంత బయటపడుతుంది.

## ప్రతిదానికీ 'నీ ఇష్టం' అనేవాడు

ఒక యువకుడు ఉన్నాడు, అతను తన గాళ్‌ఫ్రెండ్‌తో "షికారుకు వెళ్దాం" అన్నాడు.

"ఎక్కడికి వెళ్దాం?" అందామె

"నీ ఇష్టం, నువ్వు ఎక్కడికంటే అక్కడికి!" అన్నాడతను.

వాళ్ళొక రెస్టారెంట్‌కి వెళ్లారు.

""ఏమార్డరు చేద్దాం?" అన్నాడతను

""ఏదైనా ఫర్వాలేదు, చెప్పు" అందామె

"అట్లా కాదు, నీకేమి ఇష్టమో చెప్పు, అవే తీసుకుందాము" అన్నాడతను.

- అలా అతను ప్రతి సమయానా గాళ్‌ఫ్రెండ్ ఇష్టాన్ని అడుగుతూ ఆ ప్రకారం నడుచుకుంటూ వస్తాడు.

అతనెలాంటి మనస్తత్వం కలవాడు కావచ్చు?

- బహుశా అతను బాల్యం నుంచీ ఇతరుల చేత డామినేట్ చేయబడుతూ పెరిగినవాడయి ఉంటాడు. ముఖ్యంగా ఇంట్లో తల్లి చేత!
- తల్లి వద్ద ప్రదర్శించిన శక్తిహీనతనే అతను గర్ల్‌ఫ్రెండ్ వద్ద కూడా ప్రదర్శిస్తున్నాడు.

## డిన్నర్ ప్రపోజ్ చేస్తే?

❒ తొలి షికారు సమయంలో ఎక్కడికి పోదామన్న విషయం వచ్చినపుడు "ఏదన్నా రెస్టారెంటులో డిన్నరు చేద్దాం"మని అన్నాడనుకోండి, అప్పుడతని గురించి ఆ అమ్మాయి ఏమనుకోవాలి?

- అతను మనుషుల్లో కలిసిపోయే వ్యక్తి. ఆ అమ్మాయి పట్ల నిజమైన ఆసక్తి ఉందనీ, ఆ అమ్మాయి గురించి తెలుసుకోవాలనే తాపత్రయంలో ఉన్నాడనీ అనుకోవచ్చు. ఆ అమ్మాయితో అతను రొమాన్సును కోరుకుంటున్నా కూడా ప్రస్తుతానికి మాత్రం ఆమెతో కబుర్లు చెప్పాలనే ఉత్సుకతలో ఉన్నాడు.

## సినిమాకి ప్రపోజ్ చేస్తే?

❒ డిన్నర్‌కి కాకుండా ఆ యువకుడు సినిమాకు ప్రపోజ్ చేశాడనుకోండి, అప్పుడు?

- తన వాక్చాతుర్యం మీద అతనికంత సదభిప్రాయం లేదు. ఆమె వద్ద అతను టెన్షన్‌ని ఫీలవుతూ రిలాక్స్ కావటానికి కొంత సమయాన్ని కోరుకుంటున్నాడు. ఇద్దరూ కలిసి కాసేపు సినిమా చూస్తూ కూర్చుంటే సినిమా అయిపోయాక మాట్లాడటానికి అతనికి ఏదో ఒక రెడీమేడ్ టాపిక్ అంటూ దొరుకుతుంది.
- ఇంటర్వెల్‌లోనో సినిమా అయిపోయాక గానీ అతను కాఫీ, టీ లేక కూల్‌డ్రింక్‌లాంటిది తాగుదామని అన్నాడనుకోండి, మహాశయుడు అప్పుడప్పుడే వేడి పుంజుకుంటున్నాడన్నమాట!

## ఆశావహ పరిస్థితులు

తొలి షికారు సందర్భంలో యువకుడి ప్రవర్తన ఈ కింది విధాలలో ఏదో ఒక

రకంగా ఉంటే అతగాడు మంచి ప్రేమికుడేననుకుని యువతి తన ప్రేమరథాన్ని నిస్సంకోచంగా ముందుకు నడిపించవచ్చు.....

## ఆమె నిర్ణయానికి వదిలేస్తే...

❒ తొలి షికారు సందర్భంగా ఆ సాయంత్రాన్ని ఎలా గడపాలో అమ్మాయే నిర్ణయించాలని పట్టుబడితే -

- అతను తను ప్రేమించే అమ్మాయిని సంతోషపెట్టడానికి ప్రయత్నించేవాడు కావచ్చు. ఆమె అనక్తుల పట్ల కుతూహలాన్ని ప్రదర్శిస్తున్నాడనీ అనుకోవచ్చు! ఆ సాయంత్రాన్ని అతనితో గడపటానికి ఆమె పెద్దగా ఆలోచించాల్సిన పనిలేదు.
- మరొకటి కూడా కావచ్చు. అతనిలో ఇమాజినేషన్ కొరవడి వుండటం!

ఆ కొరవడిన సంగతి అతనికీ తెలిసి వుండవచ్చు. అందుకే సాయంత్రాన్ని ఎలా గడపాలన్న విషయాన్ని అతను ఆ అమ్మాయి ఇష్టం మీద వదిలేసి వుంటాడు. ఆ పిల్ల అతడి గురించి అప్పుడే ఒక అభిప్రాయానికి రాకుండా అతణ్ణి మరికొంత పరిశీలించటం మంచిది!

## వ్యక్తిత్వం గల అమ్మాయిని ఇష్టపడతానని అంటే...

❒ స్నేహితురాలితో అతడు తాను స్వంతంగా ఆలోచించే 'వ్యక్తిత్వం' కల అమ్మాయిలను ఇష్టపడతానని అనవచ్చు. అంతేగాక ఆ అమ్మాయి చదువు సంధ్యలు, ఉద్యోగాల వివరాల గురించి ఆరాలు తీయటానికీ ప్రయత్నించవచ్చు. అప్పుడు -

- అతను సమకాలీన సామాజిక జీవనగతులను ఆహ్వానించేవాడు అయి వుంటాడు. ఆర్థికంగాను, ఉద్యోగపరం గాను తన కాళ్ళమీద తాను నిలబడగలిగే స్త్రీలను మెచ్చుకుంటాడు, అంగీకరిస్తాడు.
- అతడితో స్నేహాన్ని మరికొంత వృద్ధి చెందించాక ఆమె నిస్పృహ చెందే పరిస్థితి కూడా రావచ్చు. ఎందుకంటే ఆమె అతడి మీద ఏ మాత్రం ఆధారపడ్డట్లు కనిపించినా అతడు అయిష్టాన్ని ప్రదర్శించే ప్రమాదం ఉంది.
- అయితే ఒకటి, సంపాదనలో ఆమె అతడితో పోటీపడి అతడికి సమవుజ్జీగా నిల్చినా అతడికేమంత అభ్యంతరాలూ, అయిష్టాలూ ఉండవు. అందుకు మాత్రం ఆమె సంతోషించవచ్చు!
- ఆధునిక ఉద్యోగినులకు ఇతను వరప్రసాదం లాంటివాడు.

## ఆమెను తోటి మిత్రునికి పరిచయం చేస్తే

❐ ఇద్దరూ తొలి షికారుకు వెళ్తున్న సందర్భంలో ఆమెకో అతడికో పరిచయస్థుడైన మరో యువకుడు తారసిల్లుతాడనుకుందాము. అప్పుడతను ఆ మరో యువకుడితో తన స్నేహితురాలు లేక ప్రేమికురాలు స్వేచ్ఛగా మాట్లాడే అవకాశాన్ని కల్పించితే -

- ❍ తను ప్రేమించే అమ్మాయి తాత్కాలికంగా అయినా తన ఆసక్తినీ అటెన్షన్‌నీ మరొకరి వైపు మళ్లించినప్పుడు జెలసీని ఫీలవకపోవటం అద్భుతమైన విషయమే. అంతటి గ్రేస్, కాన్ఫిడెన్స్ ఉన్నవాళ్ళు అరుదు.
- ❍ ఆమె అతనికి జేజేలు పలుకుతూ ప్రేమరథాన్ని మరింత ముందుకు ఉరికించవచ్చు!

## మరో మధుర సాయంత్రానికి స్వాగతం పలికితే

❐ తొలి షికారు సందర్భంగా వాళ్లు చూసిన సినిమా బాగుండకపోవచ్చు. లేక హోటల్లో భోజనం అంత రుచికరంగా ఉండకపోవచ్చు. లేక ఆటోవాడో, ట్రాఫిక్ కానిస్టేబులో ఇద్దరి మూడ్స్‌నీ చెడగొట్టి వుండవచ్చు. (ఇది చాలా సహజాతి సహజం!) ఏమైనా మొత్తానికి ఆ సాయంత్రం ఏమంత ఆనందదాయికంగా గడిచి ఉండకపోవచ్చు. ఆఖరికి విడిపోయేటప్పుడు అతను "సారీ, ఇలా జరుగుతుందని అనుకోలేదు. మరో సాయంత్రాన్ని ఆనందంగా గడుపుదాము" అని అంటే -

- ❍ ఈ ప్రపంచంలో ఏదీ మనమనుకున్నట్లు జరగదు. మనం ఏదో అనుకుంటాము. కానీ ఏవో అవాంతరాలు ఎదురై మన ఆనందం ఛిద్రం కావచ్చు. ఇలాంటి వాటికి మేరుధీర గంభీరత్వంతో చలించకుండా నిల్చినవాడే రాణిస్తాడు.
- ❍ మీకు నిమ్మకాయలు దొరికితే షర్బత్ చేసుకోవటానికి ప్రయత్నించాలి గానీ "అరే, ద్రాక్షపళ్ళు దొరకలేదు గ్రేప్ జ్యూస్ చేసుకోలేకపోయాను" అని చింతించితే ఏమి లాభం?
- ❍ జరిగిన దురదృష్టకర సంఘటనల్ని మర్చిపోయి ఆనందకర సంఘటనల్ని ఎలా కొనితెచ్చుకోవాలా అని ఆలోచించే మనిషి కంటే ఉత్తములు మరెవరుంటారు? ఇలాంటి యువకుడితో ప్రేమరథాన్ని ఎక్కి ఆమె మరికొంత ముందుకు సాగవచ్చు!

## శంకించదగ్గ ప్రేమికులు

ఈ క్రింది బాపతు యువకులు ఎదురైనపుడు అమ్మాయిలు వాళ్ళతో ప్రేమ యాత్రను శంకించి ప్రేమరథంలోంచి దిగిపోవటానికి ప్రయత్నించటం మంచిది.

### లేటేశ్వరరావు!

❒ షికారుకు వెళ్దామనుకున్న టైముకి అతను గంటా అరగంట ఆలస్యంగా వస్తాడు. ఆలస్యమయిందేమిటని ఆమె కళ్ళనీళ్ళ పర్యంతమై అడిగితే ఏవో కుంటి సాకులు చెబుతాడు. అతను -

- బాధ్యతల నుంచి పక్కకు తొలిగే మనిషి! ప్రియురాలి ఫీలింగ్స్‌ని ఖాతరు చేయనివాడు.
- ఆమె మీద అతనికి పెద్దగా ఇష్టం లేదేమో కూడా! బహు చక్కగా ఆమె అతడిని తన జీవితంలోంచి పక్కకు తప్పించేయొచ్చు!

### వాగుడు కాయ!

❒ సాయంత్రమంతా అతడు తన గురించి ఏవేమో చెప్పుకుంటూ ఆమె మాట్లాడడానికి కూడా పెద్దగా అవకాశమివ్వకుండా రొద పెట్టవచ్చు. అంతేగాక ఆమె గురించి అతను పెద్దగా ఆరాలు తీయటం లేక ప్రశ్నలడగటం ఏమీ చేయలేదనుకోండి-

- ఎంతసేపూ తన గురించి తాను చెప్పుకుంటూ ఇతరుల గురించి ఏ మాత్రం ఆసక్తి ప్రదర్శించనివాడు పచ్చి స్వార్థపూరితుడై ఉంటాడు. అతనికి ఆ అమ్మాయి త్వరగా గుడ్‌బై చెప్పేయడం మంచిది.
- అయితే ఒకటి, అతడు తన గురించి తాను అతిగా కాకుండా ఏ స్వల్పంగానో చెప్పుకుని ఆమె గురించి ప్రశ్నలేమీ వేయకుండా ఉంటే ఆమె గభాల్న తొందరపడి అప్పుడే అతని గురించి ఒక నిర్ణయానికి రావటమూ మంచిది కాదు.
- బహుశా అతడు ఆమె ప్రైవసీని గౌరవిస్తూ ఆమె తన గురించి తాను చెప్పుకునేదాకా నిరీక్షించాలనుకుని అనుకునేవాడు కావచ్చు. ముందుముందు కాలం చెబుతుంది ఆ విషయాన్ని!

### మునగచెట్టెక్కించేవాడు!

❒ "మీరు నాకు నచ్చారు. సరిగ్గా మీలాంటి మనిషి కోసమే నేన్నిన్నాళ్ల నుంచీ ఎదురు చూస్తున్నాను" అని అనవచ్చుతను.

- ఇవి కథలలోనూ, సినిమాలలోనూ పనికివచ్చే డైలాగులు తప్ప నిజజీవితంలో వుత్త అబద్ధ రాజాలు.
- తొలి షికారు నాడే ఒక యువకుడు తన గాళ్‌ఫ్రెండ్‌తో అలా అన్నాడంటే అతనామెను మునగ చెట్టెక్కిస్తున్నాడన్న మాట! అక్కడినుంచి దభేల్న పడిపోకముందే ఆమె జాగ్రత్త పడటం మంచిది!

## సమస్యల సతమతరాయుడు

❑ అతడు తనకేవో సమస్యలున్నాయనీ, స్నేహితులు తనకు సమస్యలు సృష్టిస్తున్నారనీ, స్వకుటుంబీకులు కూడా ఏమంత సుఖంగా ఉండనీయటం లేదనీ వాపోయాడనుకోండి -

- ఎప్పుడూ ఇతరుల గురించి చెడు మాట్లాడే మనిషిని మనం నిస్సంకోచంగా సందేహించవచ్చు. బహుశా తనలోని చెడును అతను ఇతరుల మీదికి ప్రాజెక్ట్ చేస్తుండి వుంటాడు.
- ముందు ముందు అతడు మరింత 'డల్' గా తయారయే ప్రమాదం వుంది. అతడి గురించి ఆమె ముందే జాగ్రత్తపడటం మంచిది -

## వంకలెంచేవాడు

❑ తొలి షికారు సందర్భంలోనే అతను ఆమె రూపం గురించీ ('నీకీ డ్రస్సు అంత నప్పలేదు, మొన్నటి గులాబీ రంగు డ్రస్సు వేసుకురావాల్సింది'), ఆమె ప్రవర్తన గురించీ ('నీకేం కావాలో చెప్పు, వెయిటర్‌తో నేను చెబుతాను కదా'), ఆమె తెలివితేటల గురించీ ('అది కరక్టు కాదు, ప్రపంచ రాజకీయాల గురించి తెలిస్తే నువ్విట్లా అనవు) ఈ రకంగా విమర్శ నాత్మకంగా మాట్లాడాడనుకోండి -

○ తన గురించి తాను అసంతృప్తితో బాధపడుతున్న స్వయం స్పృహ కల మనిషి ఇతను. స్వంత అభిప్రాయాల కంటే ఇతనికి అరువు తెచ్చుకున్న అభిప్రాయాలు ఎక్కువ.

○ చిలక పలుకులూ, నాటకీయతా, హిపాక్రసీ ఎక్కువ ఇతనిలో. వ్యక్తిత్వం, ఆత్మవిశ్వాసం కల స్త్రీ ముందు ముందు ఇతని వద్ద దారుణంగా కించబడే ప్రమాదం ఉంది.

సో....

ప్రేమరథాన్ని అధిరోహించిన అమ్మాయిలూ, మీ రథసారథి గురించి అనేక విధాలుగా ఆలోచించడం మంచిది. లేదా ఆ రథంలో మీరు కుళ్ళి కుళ్ళి ఏడవాల్సి రావటమో లేక మీరందులోంచి కింద పడిపోయి మీ స్థానంలో మరో 'అమాయిక' కూర్చోవటమో జరిగే ప్రమాదం ఉంది.

విష్ యూ ఎ క్లెవర్ బ్రెయిన్!!



# 7



# డ్రైవింగ్ చేసే తీరు, టిప్పిచ్చే హోరు

(పరుగెత్తే కారునాల్లో ఎగుగెత్తే ప్రేమికుడి మనసు!
'టిప్పు' టాపు చూశాక లిప్పుకు లిప్పు కుల్పు!)

కులుకుల కలికీ!

నీ బాయ్‌ఫ్రెండ్ కాస్త ధనికుడైతే అతనికో బుల్లి సైజు కారుండవచ్చు. మధ్యరకం ఆస్తిపరుడైతే స్కూటరో, మోటారు సైకిలో వుండవచ్చు.

తొలి షికారు నాడు మీరిద్దరూ ఎక్కడికి వెళ్దామన్న విషయమై ఒక ప్రోగ్రాముని నిర్ణయించుకొన్నాక ఆ ఫలానా చోటికి అతను నిన్ను తన వాహనం మీద తీసుకు వెళతానంటాడు. ఆ తీయటి అనుభవానికి నీ మనసు ఉవ్విళ్లూరుతుంది.

సరేనంటావు నువ్వు. అతను స్కూటరును స్టార్టు చేశాక కులుక్కుంటూ గజ్జలగుర్రంలా ఎగిరి వెనక కూర్చుంటావు. అప్పుడిక...

ఒక మనిషి వాహనాన్ని నడిపే విధానం అతడి మూడ్‌నీ ఇతరులతో సంబంధ బాంధవ్యాల విషయంలో అతడి దృక్పథాన్నీ తెలియజేస్తుంది.

రోడ్డు మీద తన పక్కనపోయే వాహనాల విషయంలో అతడెలా స్పందిస్తాడనేది తన జీవితంలో ఎదురయ్యే ముఖ్య వ్యక్తుల విషయంలో అతడెలా



ప్రతిస్పందిస్తాడనేదాన్ని తెలియజేస్తుంది.

కాబట్టి - రాబోయే రోజుల్లో అతడి జీవితంతో భాగం పంచుకోవాలనుకుంటున్న నీకు అతడి వాహనం వెనక కూర్చోవటం వల్ల అతడా వాహనాన్ని నడిపే తీరును బట్టి అతడెలాంటివాడో తెలుసుకోవడానికి ఎంతో కొంత వీలు కలుగుతుంది.

ఇప్పుడు ఆ వాహనం నడిపే విధానాలు, వాటి విశ్లేషణల గురించి చూద్దాము.

## గాలిలో గుర్రంలా నడిపితే....

☐ ఉత్తప్పుడు అతను నీకు చాలా నిదానస్తుడిలా కనిపిస్తాడు. కాని ఆ రోజు వాహనాన్ని నడుపుతున్నప్పుడు మాత్రం అతని వేగమేమిటో తెలిసి వస్తుంది నీకు.

- పద్మవ్యూహంలోని అభిమన్యుడిలా ట్రాఫిక్‌లోంచి దూసుకుపోతూ, ఎదుటి వాహనాల్ని 'కట్' కొడుతూ, తప్పించుకుపోతూ, అతి చిన్న అవాంతరానికి కూడా అసహనంగా హారన్ కొడుతూ....
- నువ్వు భయంతో నెమ్మదిగా పోనివ్వమని అంటే "ఏం భయం లేదు, గాభరాపడకు" అని నవ్వేసి తన మానాన తను పోతుంటే నీకు లోలోపల ఎక్కడ యాక్సిడెంటు అవుతుందోనని ఆందోళన తొలుస్తుంటుంది....

ఇతని మనస్తత్వమేమిటి?

- వాహనాన్ని వేగవంతంగా నడిపే చోదకుని హృదయంలో ఇతరుల మీద కక్ష, కోపం, తిరస్కారంతో కూడుకున్న ఉద్వేగాలేవో పేరుకొని ఉంటాయి. బాల్యం నుంచీ అతను ఇంట్లో కఠిన డిసిప్లిన్‌లో పెరిగినవాడై వుంటాడు.
- ఇతరులు తన ప్రవర్తనకు పరిధుల్ని విధిస్తే కుతకుతా వుడికిపోతూ తన స్వతంత్రతను వెలిబుచ్చడానికి తెగింపును ప్రదర్శిస్తుంటాడు. ఇతరులతో రాజీపడడానికి ఏ మాత్రం ఇచ్చగించని స్వార్థజీవి. ఆఖరికి తన గర్ల్‌ఫ్రెండ్ అనుభూతుల్ని కూడా లెక్క చేయడన్న మాట!
- ఉద్వేగపరంగా ఇతను చాలా అపరిపక్వ మనస్కుడు. ఇతని ప్రేమలో స్త్రీకి కొన్ని చికాకులు ఎదురయ్యే అవకాశం ఉంది. ఇతనితో ప్రేమ విషయంలో స్త్రీ కొంచెం ఆలోచించి అడుగు ముందుకు వేయటం మంచిది.

## తాపీ చోదకుడు

☐ పైన చెప్పిన వ్యక్తికి పూర్తిగా భిన్నమైనవాడితను. వాహనాన్ని ఒక క్రమబద్ధమైన వేగంతో నిదానంగా నడుపుతాడు. సడన్‌గా వాహనానికి ఎవరు అడ్డం వస్తారో, పక్కలనుంచి అనుకోకుండా ఏ వాహనం రావచ్చునో అన్నట్లుగా అతి జాగ్రత్తగా ఆచి తూచి నడుపుతుంటాడు... ఇతను?

- జీవితంలో ఏదైనా అనుకోని అననుకూల పరిస్థితి ఎదురైతే తట్టుకోలేని అర్భక రావు ఇతను! నిరంతరం తనను దాటుకుని ముందుకు పోతుండే

వ్యక్తులను చూసి ఈర్ష్యపడుతుంటాడు తప్ప తనూ వాళ్ళను దాటిపోదామనే తాపత్రయాన్ని ప్రదర్శించడు.

- తనలోని శక్తి సామర్థ్యాలను అణచి ఉంచుకునే మనిషి ఇతను -
- ఇలాంటి వ్యక్తి ప్రేమలో కూడా అడుగుముందుకు వేయటానికి జంకుతాడు. గర్ల్‌ఫ్రెండే చొరవ తీసుకోవాలి. అతడి ధైర్య స్థైర్యాలనే బ్యాటరీని ఆమె తరచుగా 'ఛార్జ్' చేయాల్సి వస్తుంటుంది. ఆమెకా చొరవ ఉంటే మాత్రం అతను మంచి జోడీ! లేకపోతే వాళ్ళ జీవితాలు కుంటినడక నడుస్తాయి!

## ట్రాఫిక్ రూల్స్‌ని పాటించేవాడు

❒ మరీ వేగంగా పోకుండా మరీ నిదానంగా పోకుండా ట్రాఫిక్ రూల్స్‌నీ, సిగ్నల్స్‌నీ పాటిస్తూ ఒక పద్ధతిగా వాహనాన్ని నడిపే వ్యక్తి...

- పరిపక్వ మనస్తత్వం కలవాడు! తనెక్కడికి పోతున్నాడో, తనేం చేస్తున్నాడో గుర్తుంచుకునే ప్రాక్టికల్ మనిషి.
- ఇలాంటి వ్యక్తి నెత్తిమీద స్త్రీ తన జీవనభారాన్ని గొప్ప భరోసాతో మోపి హాయిగా ఊపిరి పీల్చుకోవచ్చు. పెద్దగా మూడ్స్ ఏమీ లేకుండా తనను తాను కంట్రోల్‌లో ఉంచుకుంటాడితను!
- చాలామంది స్త్రీలు ఇలాంటి పురుషులు దొరికితే బాగుండునని కోరుకుంటారు. కానీ, తుఫానులాంటి ప్రేమ సముద్రంలో ఈదులాడాలని కోరుకునే స్పీడ్ స్త్రీలకు మాత్రం ఇతను సరిజోడీ కాదు.

## ఒకటే హారను మోగించేవాడు

❒ ఇతని బొటనవేలు ఎప్పుడూ హారను బటను మీద ఉంటుంది. అంత దూరాన మనిషి ఉన్నా కూడా హారనును ఒకటే 'బొయ్యి' మని మోగిస్తూంటాడు. దారి పొడుగూతా వెనక కూర్చున్న స్త్రీకి ఇతను హారను మోగించటమే వినిపిస్తుంటుంది...

ఇతనెలాంటివాడు?

- ఇతని లోపల కోపతాపాలు ఒకటే పేరుకుని ఉండి ఉంటాయి. తిక్కతిక్కగా ఉంటాడు. వాహనం మీద కూర్చున్నప్పుడు హారను మోగిస్తున్నట్లే వాహనం అవతల ఇంట్లో ఉన్నప్పుడు కూడా వాళ్ల మీదా వీళ్ల మీదా అరుస్తుంటాడు.
- అరుపులు, కేకల ద్వారా తప్ప ఎదుటివాళ్లు తన మాటలు వినరనీ తనను పట్టించుకోరని భావిస్తుండే మనిషి.

- వాహనం మీద లాగానే స్త్రీతో జీవితాన్ని పంచుకునే విషయంలో కూడా ఇతను న్యూసెన్స్ గా ఉంటాడు. తొలి షికారుతోనే యువతి ఇతడికి గుడ్‌బై చెప్పేయటం మంచిది. లేకపోతే తన హారను మోతలతో రోడ్డు మీద జనాన్ని పిచ్చెత్తించినట్లుగానే ఇంట్లో భార్యను కూడా ఇతను తన అరుపులు కేకలతో పిచ్చెక్కించేస్తాడు!

సరే వాహనం మీద మీరిద్దరూ చేరుకోవాలనుకున్న చోటికి చేరుకున్నారు.

ఎక్కడికి చేరుకున్నారు? సినిమా హాలుకా? రెస్టారెంటుకా?

రెస్టారెంటుకు అనుకుందాం లేక హోటలుకు అనుకుందాము. అక్కడ అతని ప్రవర్తనని చూద్దాము-

## సంప్రదాయస్తుడు

❒ సామాన్యంగా తొలిసారి హోటలుకు వెళ్లినపుడు పురుషుడే హోటలు బిల్లును చెల్లిస్తాడు. కానీ బిల్లు వచ్చినపుడు మొహమాటానికో, మరెందుకైనా గానీ గర్ల్‌ఫ్రెండ్ బిల్లును తాను చెల్లిస్తానన్నదనుకోండి, అప్పుడతను 'అదేమిటి నువ్వు చెల్లించటం?' అని విచిత్రంగానో, గాయపడ్డట్లో చూశాడనుకోండి...

- అతను సంప్రదాయకుడు, స్త్రీ పురుష సంబంధాల విషయంలో కూడా సంప్రదాయ బద్ధ సనాతన భావాలు కలిగివాడై వుంటాడు. వివాహంలో భార్య అణగి ఉండడం, భర్త అధికారాన్ని కలిగి ఉండటాన్ని సహజంగా భావించే మనిషి అయి ఉంటాడు.

## ఖర్చుని ఖాతరు చేయనివాడు

❒ బేరరు బిల్లును తీసుకువస్తాడు. అతను బిల్లువేపుకు ఓసారి అలవోకగా చూసి పర్సులోంచి ఓ పేద్దనోటును నిర్లక్ష్యంగా ట్రేలో వదిల్తే -

- డబ్బును తాను పెద్దగా లెక్కచేయననే విషయాన్ని ఎదుటివాళ్ళకు తెలియ జేయాలనే తాపత్రయం కలవాడితను. ముఖ్యంగా తన గర్ల్‌ఫ్రెండ్‌కి ఈ విషయాన్ని తెలియజేసి ఆమెను ఆకట్టుకోవాలని చూస్తున్నాడు!
- ఏదన్నా షాపు పక్కనుంచి నడుస్తున్నప్పుడు గర్ల్‌ఫ్రెండ్ తనకు ఫలానా వస్తువు బాగున్నది అని అంటే వెంటనే అతనామెకు దాన్ని కొని ఇచ్చేస్తాడు.
- ఇతనే మరో రకమైన మనస్తత్వం కలవాడూ కావచ్చు-
- మనుషుల్ని తేలికగా నమ్మేవాడు కావచ్చు. ఎదుటివాళ్ళలో ఏవన్నా చిన్న

చిన్న లోపాలు ఉన్నా వాటిని పెద్దగా పట్టించుకోడు. విమర్శనా ధోరణికి దూరం. గాళ్‌ఫ్రెండ్ అందమైన దుస్తులు వేసుకోకపోయినా ఆమె అతనికి అందంగానే కనిపిస్తుంది.

- ఆ ముందురోజు ఆమె మరో కుర్రవాడితో కబుర్లు చెప్పినా, సినిమాకు వెళ్లినా అదేమిటని అడగడు. డబ్బు ఖర్చు చేసే విషయంలో లాగానే మిగతా విషయాలలో కూడా ఇతని హృదయం విశాలం!

## నిఖార్సు లెక్కలవాడు

❑ బేరరు బిల్లు తేగానే ఇతను తాము తిన్నవాటికే బిల్ చేశాడా, రేట్లు సరిగా వేశాడా లేదా, మొత్తం కూడిక సరిగా వున్నదా లేదా అన్నది పరిశీలిస్తాడు...

ఇతనెలాంటివాడు? -

- ఇతనికి మనుషుల మీద అంత నమ్మకం వుండదు. మనం జాగ్రత్తగా ఉండకపోతే ఎదుటివాళ్ళు మనల్ని మోసం చేస్తారనే శంకిత మనస్కుడు.
- గర్ల్‌ఫ్రెండ్ విషయంలో కూడా అతను ఇలా శంకించే అవకాశం ఉంది. ఆమె చేసే ఖర్చుల్ని, ఆమె ఎక్కడెక్కడ తిరిగిన విషయాల్ని ఆరా తీస్తుంటాడు.

## నిశితనేత్ర నిర్లక్ష్యుడు

❑ బేరరు బిల్లు తేగానే ఒకసారి ఓరకంట దానిని పరీక్షించి నిర్లక్ష్యంగా డబ్బుల్ని బిల్ ప్లేటులో పడేసే మనిషి...

- తన చుట్టూ ఉండే లోకాన్ని లెక్కచేయనట్లు ఉంటూనే తన జాగ్రత్తలో తానుంటాడు. ఇతనికి ఆత్మవిశ్వాసం ఎక్కువ. డాంబికం తక్కువ.
- ఇతను గర్ల్‌ఫ్రెండ్ డ్రస్సువేపు మెచ్చుకోలుగా చూస్తాడు కాని ఆమెకు డ్రస్సు కొనివ్వటం మాత్రం చేయడు!

## ఫిఫ్టీ ఫిఫ్టీవాడు

❑ బేరరు బిల్లు తెచ్చినపుడు ఇతను కొద్దిసేపు దానివేపు చూస్తాడు. ఆ బిల్లును తాను పే చేయాలా వద్దా అన్నట్లు! అతడి వాలకాన్ని చూసి గర్ల్‌ఫ్రెండ్ బిల్లును తాను పే చేస్తానంటే అందుకోసమే ఎదురుచూసున్నవాడిలా వద్దు వద్దు, ఇద్దరం చెరిసగం పే చేద్దాం అంటాడు.-

- రొమాంటిక్ లక్షణాలకు బహుదూరుడితను. గర్ల్‌ఫ్రెండ్‌ని కూడా తన మిగతా మగ స్నేహితులలాగే చూస్తాడు.
- ఇతనితో సంసారంలో స్త్రీ ఎంతోకొంత ఇండిపెండెంట్‌గా ఉండటానికి

అవకాశా లెక్కువ. రొమాన్సు కోసం చూడని స్త్రీకి తనకు తాను స్వతంత్రంగా ఉండాలనుకునే స్త్రీకి - ఉద్యోగం చేసే స్త్రీకి - ఇతను ఆదర్శపురుషుడు. ఏమైనా రొమాన్సులేని జీవితం వ్యర్థమే కదా!

- అయితే రొమాన్సు అవసరం లేదు, నన్ను నా మానాన బతకనిస్తే చాలుననుకునే స్త్రీకి మాత్రం ఇతను వరప్రసాదుడు!!

❒ ఈ ఆధునిక కాలంలో హోటళ్ళలో, రెస్టారెంట్లలో బిల్లు చెల్లించడం ఒక ఎత్తయితే బిల్లును తెచ్చిచ్చిన సర్వరుకి టిప్పివ్వడం ఒక ఎత్తు!

- డిగ్రీ, ఆపై స్థాయి యువకులు సర్వరుగా, వెయిటరుగా, బార్ అటెండర్‌గా పనిచేస్తున్న ఈ రోజుల్లో బిల్ ప్లేటులో కస్టమర్ ఎంత డబ్బును టిప్‌గా వదుల్తాడనేది ఆ కస్టమర్ స్టేటస్‌ని తెలియజేస్తుంది. అంతేగాక ఆ టిప్ ఇచ్చే విధానం అతగాడి మనస్తత్వాన్నీ బయటపడేస్తుంది.
- ఇప్పుడు తన వెంటే హోటలుకు తీసుకుపోయిన గర్ల్‌ఫ్రెండ్ సమక్షంలో రొమాన్స్ రావు సర్వారాయుడికి ఎంత టిప్పును వదుల్తాడో ఆ టిప్పును బట్టి ఆ అమ్మాయి అతడి గురించి ఎలాంటి అభిప్రాయానికి రావచ్చో చూద్దాము.

*రెడీయేనా అమ్మాయీ?... అయితే అవధరించుము.*

## టిప్పివ్వని వాడు

మొదటగా అసలు టిప్పివ్వని వాని గురించి చూద్దాము -

❒ హోటల్లో వెయిటరు ఎంత నమ్రతగా సర్వ్ చేసినా తినే పదార్థాలు ఎంత రుచికరంగా ఉన్నా, ఆఖరికి గర్ల్‌ఫ్రెండ్ సమక్షంలో కూడా 'మనం బిల్ పే చేస్తున్నాము, ఇంకా ఇతనికి టిప్పిచ్చేదేమిటి?' అనే ధోరణిలో స్వల్పాతి స్వల్పపు టిప్‌నో లేక అసలు టిప్‌నే వదలకుండానో బయటికి వచ్చేవాడు....

- అతను మరీ డబ్బు మనిషి! తనకు అంత నమ్రతగా సర్వ్ చేసిన సర్వరుకు టిప్పిచ్చేపాటి కృతజ్ఞతలను కూడా చూపని వ్యక్తి తన గర్ల్‌ఫ్రెండ్ విషయంలో కూడా అంతే పిసినారితనాన్ని చూపుతాడని అనుకోవచ్చు!
- ఆమెతో అతని సంబంధ బాంధవ్యాలు సజావుగా ఆరోగ్యకరమైన రీతిలో ఉంటాయనుకొనేందుకు ఏ మాత్రం వీలులేదు. ఆమెను పొగడటం, ఆమె పట్ల ఆప్యాయతను ప్రదర్శించడం లాంటి విషయాలలో కూడా టిప్పిచ్చే విధానంలాగే అతను అతి పిసినారితనాన్ని ప్రదర్శిస్తాడు.

- ప్రేమను ప్రదర్శించే విషయంలో ఎమోషనల్‌గా అతను కడు పేదవాడు! ఆ అమ్మాయి అతనికి ఎంత ఎడంగా ఉంటే అంత సుఖపడుతుంది.

## 'సరే తీసుకో' - అనే పద్ధతివాడు

❒ వెయిటరు ఎలా సర్వ్ చేసినా తాము తిన్న పదార్థాలు రుచికరంగా వున్నా లేకపోయినా పెద్ద పట్టించుకోకుండా సర్వరు బిల్లు తెచ్చిచ్చాక ఆ బిల్లు మొత్తాన్ని బట్టి వందకు పదో అయిదో పదిహేనో లెక్కన ఓ పద్ధతిగా టిప్పు వదిలే వ్యక్తి....

- అతను సంప్రదాయస్తుడు. 'అతి' కి గానీ 'మితా'నికి గానీ పోని సమబద్ధమైన టెంపరమెంట్ కలవాడు. జీవితంలో పెద్ద అసంతృప్తికి లోనుకాని వాడు!
- గర్ల్ ఫ్రెండ్‌తో ప్రేమవిషయంలో ఇతను నమ్మకంగానూ నిజాయితీగానూ ప్రవర్తిస్తాడు. అయితే అతని నుంచి ఆమె పెద్దగా అడ్వంచర్స్‌ని గానీ, మహోధృత ప్రేమను గానీ ఆశించకూడదు. ఆశించితే భంగపడక తప్పదు!
- ప్రేమ విషయంలో ఇతను పెద్దగా ఎగుడు దిగుడులు లేని మైదనం మీద ప్రవహించే ప్రశాంత నదిలాంటి వాడు! సాధారణ సంప్రదాయక సంసార స్త్రీకి సరిజోడీవాడు.

## కలేజా దిల్‌వాడు

❒ బిల్ చెల్లించడం కోసం తనిచ్చిన నోటుకు మిగతా చిల్లర తీసుకువచ్చిన సర్వరుకు వెనకా ముందూ చూడకుండా పెద్ద మొత్తాన్ని టిప్పుగా వదిల్తే....

- ఇతని గురించి అతని గర్ల్‌ఫ్రెండ్ గభాల్న భ్రమపడి ఒక అభిప్రాయానికి రావడం మంచిది కాదు. ఇతను బాగా డబ్బున్నవాడయి ఉంటాడు. ఆ అమ్మాయి వద్ద ఇంప్రెషన్ కొట్టడానికి (లేక పోజ్ కొట్టటానికే అనుకోవచ్చు) ప్రయత్నిస్తుండి ఉండాలి.
- తను డబ్బు ఖర్చు చేస్తే తప్ప ఎవరూ తనను మెచ్చుకోరు అనుకునే భద్రతారాహిత్య భావనలో కొట్టుమిట్టాడుతున్నవాడై వుంటాడు!
- ఇలాంటి వ్యక్తులు తాము ప్రేమించే స్త్రీలను బహు మత్తులో ముంచెత్తుతుంటారు. అయితే అతని లోని భద్రతా రాహిత్య భావం ఆమెకు తర్వాత తర్వాత ఒక సమస్యగా అయ్యే ప్రమాదమూ లేకపోలేదు.
- వివాహమయ్యాక ఆమె హమేషా అతనిని కనిపెట్టుకుని ఉండి తరచుగా అతడిని వెన్నుతట్టుతుండాల్సిన అవసరం ఉంటుంది!

# 8



# నలుగురిలో ప్రవర్తన ఏం చెబుతుంది?

(ఊడు, నడవడిక చూశాకే ఏడు అడుగులు నడవండి!)

ఇప్పటి దాకా మనం ఒక అమ్మాయి ఒక అబ్బాయితో స్నేహించినపుడు లేక ప్రేమించినప్పుడు అతని వివిధ అభిరుచులను బట్టి అతని ఆలోచనా ధోరణి ఎలా ఉంటుందో, అతను ఎలాంటివాడో అంటే స్వార్థపరుడో, విశాలహృదయుడో, కోపధారో, ప్రేమమయుడో, వంటి లక్షణాలు, అతడామెను ప్రేమలో ముంచెత్తుతాడో లేక రొమాన్సును వెళ్ళబెట్టి నట్టేట ముంచడానికి అవకాశముందా లాంటి విషయాల గురించి తెలుసుకున్నాము.

ఇప్పుడిక నలుగురిలో ఉండగా అతని ప్రవర్తన ఎలా ఉంటుందో చూద్దాము. అంటే అతని సామాజిక ప్రవర్తన గురించి-

ఒక యువకుడి తాలూకు సహజసిద్ధ అలవాటుపూర్వక ప్రవర్తన ఒకరకం అమ్మాయిలకు అతికినట్టుగా సరిపోతే మరోరకం అమ్మాయిలకు భరించలేని ఎలర్జెటిక్‌గా ఉంటుంది. అది ఆయా యువతుల వ్యక్తిత్వాల మీద ఆధారపడి ఉంటుంది. అవేమిటో చూద్దామిప్పుడు -

## సరదారాయుడు

☐ ఇతను నలుగురితోనూ కలుపుగోలుగా సదా జోకులు వేస్తూ సరదాగా వుంటాడు.



నలుగురు కూడిన చోట ఇతను ప్రవేశించగానే ఆ పార్టీలోకి కొత్తగా జీవం ప్రవేశించినట్లు అవుతుంది. నానారకాల జోకులు వేసి అతను నవ్విస్తాడు. ఒకోసారి ఆ జోకులు కొంచెం బూతుగా కూడా ఉండి సంప్రదాయస్థులు, సంస్కారవతులు అయిన స్త్రీలకు ఇబ్బందిని కలిగిస్తాయి కూడా. వ్యభిచార ప్రవృత్తి గల ఆడవాళ్ళకు మాత్రం అవి ఆనందకరంగా ఉంటాయి. వాళ్ళు ఆ ఆనందాన్ని బాహాటంగానే వ్యక్తపరుస్తారు కూడా. ఫకాలున నవ్వి ప్రోత్సహించటం ద్వారా.

ఇతను పార్టీలోకి రాగానే తమాషాను ఫీలయి నలుగురూ ఇతని చుట్టూ గుమిగూడతారు.

ఇతను ఎలాంటి స్త్రీలకు సరిపోతాడు?

- గుంపును ఆకర్షించి వాళ్ళ మధ్య తను కేంద్ర బిందువుగా కనిపించడానికి ప్రయత్నించే మనిషిలో గుంపును డామినేట్ చేయాలనే కోర్కె, అవసరం అంతర్గతంగా దాగి ఉంటాయి.
- గుంపును డామినేట్ చేయాలనే కోర్కె, అవసరాలు అతనిలోని ఆత్మవిశ్వాస రాహిత్యం లోంచి పుట్టుకువస్తాయి. మనుషుల్ని తన చుట్టూ గుమికూడేట్లు

చేయటం ద్వారా అతను ఎప్పటికప్పుడు తనలో లోపించిన ఆత్మవిశ్వాసాన్ని సమకూర్చుకుంటూ ఉంటాడు.

- బూతు జోకులు వేయడం వెనక మనస్తత్వపరంగా అతనిలో ఈ కింది రెండు కారణాల్లో ఏదో ఒకటి పనిచేసే అవకాశం ఉంది.

1. అతను ఏదో సెక్సు లోపంతో బాధపడుతుండి ఉండాలి. దానిని కప్పిపెట్టుకోవడానికి అతను చేసే ప్రయత్నం అది!

2. అతనికి సెక్సుపిచ్చి ఎక్కువ ఉండి వుండాలి. కొన్ని రకాల మగపక్షులు తమ నృత్య గానాలతో ఆడపక్షులను ఆకర్షించుకోవడానికి ప్రయత్నించినట్లుగానే ఇతను కూడా తన బూతుజోకుల ద్వారా 'ఆ బాపతు' స్త్రీలను ఆకట్టుకునే ప్రయత్నం చేస్తుంటాడు. బూతుజోకులంటే ఇక్కడ అతను డైరెక్టుగా బూతుల్ని మాట్లాడతాడని కాదు. తెలుగు సినిమాల్లోని ద్వందార్థాల పదాలలాంటి వాటిని వాడతాడు!

- స్వేచ్ఛా ప్రవర్తన, స్వేచ్ఛా ప్రవృత్తి గల స్త్రీలకు ఇతను బాగా నచ్చుతాడు. కాని మేధోపరంగా ఉచ్చ స్థానంలో ఉండి డిగ్నిఫైడ్‌గా ఉండే స్త్రీలకు ఇలాంటి వాళ్ళు చులకనగా బేవార్సుగాళ్ళలా కనిపిస్తారు. ముఖ్యంగా కింది తరగతి మనస్తత్వం గల స్త్రీలకు ఇతను నచ్చే అవకాశం ఉంది.

## పురుష జన పరివేష్టితుడు

☐ ఇతను ఎంతసేపూ స్నేహితులతో ముసురుకుని ఉంటాడు. వాళ్ళంతా కూడా మగవాళ్ళే. ఆ మగమిత్రులతో కలిసి పార్టీలు చేసుకుంటాడు. పేకాడతాడు. సినిమాలకు వెళ్తాడు. సాయంత్రాలు సెలవు రోజుల్లోనూ ఆ స్నేహితుల్తోనే కాలం గడుపుతాడు. పార్టీల్లో ఫంక్షన్‌లలో ఎప్పుడన్నా స్త్రీ కొలీగ్‌గాని, పాత స్త్రీ క్లాస్‌మేట్ గాని కనపడ్డా 'హలో' అంటాడు తప్ప ఆమెతో కబుర్లు మాత్రం వేసుకోడు.

- ఇతనెలాంటి స్త్రీకి నచ్చుతాడు?

- భర్తతో కలిసి ప్రేమగా కబుర్లాడుదామనీ, గోముగా గారాలు పోదామనీ అనుకునే స్త్రీకి ఇతను అసహనాన్ని కలగజేస్తాడు. ఆమెను పట్టించుకోకుండా ఎంతసేపూ తన మిత్రులతో కాలక్షేపం చేసే ఇతను ఆమెకు కోపాన్ని కలిగించడమే కాక నిరాశాజనకంగా కూడా అనిపిస్తాడు.

- కొందరు స్త్రీ లుటారు, తమకు తాను స్వతంత్రంగా ఉండాలనీ, తమ స్వతంత్రతకు భర్త అడ్డుకట్ట వేయకూడదనీ కోరుకుంటూ... ఇలాంటి స్త్రీలకు మాత్రం ఇతను చక్కగా నచ్చుతాడు.

## కొంగుచాటు కృష్ణుడు

❒ కొందరు పురుషులు ఆడగాలి సోకితే చాలు రెపరెపలాడిపోతారు. అందులోనూ ఆకర్షణీయమైన అమ్మాయి కనిపించితే మరీ! ఎంతో ఆత్మీయంగా ఆమె అంటే తనకు ఎంతో ఆసక్తి అని తెలియజేస్తూ తనంటే ఆమెకు ఆసక్తి ఉన్నదన్నట్లుగా ప్రవర్తిస్తారు.

ఏదన్నా ఫంక్షన్ లేక పార్టీ జరుగుతున్నప్పుడు అక్కడున్న ఆడవాళ్ళ దృష్టంతా తనమీద కేంద్రీకరింపబడాలని కోరుకుంటూ, అందుకోసం నానా అగచాట్లు పడుతుంటాడు.....

ఇతని మాట??

- తన అందచందాల మీద, తన స్త్రీత్వం మీదా స్వయం ఔన్నత్యభావం కల స్త్రీ ఇతణ్ణి ఏ మాత్రం భరించజాలదు. నిజంగా రొమాంటిక్‌గా ఉండే పురుషుడు అర్థమైన అర్థగాడిదలాంటి ఏ స్త్రీ కోసమూ వెంపర్లాడడనీ అతడికి ఎంతమంది ఆడ స్నేహితులున్నా తన రిక్వైర్‌మెంట్స్‌కి సరితూగే ఒకానొక ప్రత్యేక స్త్రీ పట్ల మాత్రమే శ్రద్ధ చూపిస్తాడనీ ఆమెకు తెలుసు.
- ఇలాంటి స్త్రీకి ప్రతి ఆడదాని పట్లా వెంపర్లాడే ఇతనంటే జెలసీ కాక చులకనభావమే ఉంటుంది.
- తన స్త్రీత్వం, అందచందాల పట్ల అంతగా కాన్ఫిడెన్స్ లేని భద్రతారాహిత్య భావంతో బాధపడే స్త్రీ మాత్రం అతడికి భార్య అయితే అతడి చేష్టలకు విపరీతమైన జెలసీతో బాధపడే అవకాశం ఉంది.
- భర్త ధ్యాస, అటెన్షన్ అంతా తనమీదే ఉండాలని కోరుకునే స్త్రీకి ఇతను భయంకర క్షోభనందించే ప్రమాదం ఉంది.
- ఏరకంగా చూసినా ఈ రెండు రకాల స్త్రీలకూ ఇతను సరికాని జోడీయే!

## బిడియ కుమారుడు

❒ నలుగురిలో ఉన్నప్పుడితను బిడియపడుతూ అనీజీగా కూర్చుంటాడు. ఎవరి దృష్టినీ ఆకర్షించకుండా, ఓ మూల కనిపించీ కనిపించనట్లు కూర్చుంటాడు. అమ్మాయితో లేక స్త్రీతో మాట్లాడాల్సి వచ్చినపుడు సిగ్గిలటమూ తోటి పురుష స్నేహితులతో మాత్రం కలివిడిగా ఉండడమూ చేస్తాడు.

- ఇలాటి వాళ్ళు?

- నిశ్శబ్దంగా బిడియంగా ఉండేవాళ్ళలో చాలామంది కొత్తవాళ్ళ ముందు

మాత్రమే అలా ప్రవర్తించటం జరుగుతుంది. చిన్నప్పటినుంచీ వంటరిగా పెరగటమూ, నలుగురిలో మెలగటానికి అవసరమయ్యే సోషల్ స్కిల్స్ (కలివిడితనం) తెలియక పోవడమూ ఇందుకు కారణాలు.

- అంతేగాక అవతలివాళ్ళను కాసేపు స్టడీ చేసిగానీ వీళ్ళు మాట్లాడటమనే ముగ్గులోకి దిగరు. తను అంగీకరించబడ్డట్లుగా అనిపించి, తనకు తాను సుఖకరంగా ఫీలయినప్పుడు మాత్రమే వీళ్ళు ముగ్గులోకి దిగటానికి అంగీకరిస్తారు.
- ఇలాంటి వ్యక్తి సిగ్గిలుతూ కూర్చున్నంతసేపూ స్త్రీకి అతని అసలు వ్యక్తిత్వమేమిటో అర్థం కాక పజిలవుతూ కూర్చుంటుంది. ఒకోసారి అతనలా సిగ్గిలటం చూసి ఆమెకు చికాకు కలగవచ్చు కూడా.
- కాని ఒకసారి అతను ఆ బిడియమనే తొడుగును అవతల పడేసి తన షెల్‌లోంచి బయటికి రాగానే మాత్రం ఆమె అతనిలో అంత రహస్య రాకేశుడున్నాడా అని ఆశ్చర్యపోయే అవకాశం ఉంది.
- పెళ్ళయితే ఇతను భార్యకు అంటిపెట్టుకుని చాలా కమిటెడ్‌గా ఉంటాడు.
- నలుగురి ముందూ బడాయిని ప్రదర్శించకుండా తనకు తాను సాఫీగా సుఖంగా జీవితాన్ని గడపాలనే సంసారపక్ష కోర్కెలు గల స్త్రీని ఇతను ఏమాత్రం నిరాశపర్చడు.
- "నన్ను చూడు, నా మొగుడ్ని చూడు, మా తళుకుల్ని చూడు, మా బెళుకుల్ని చూడు" అంటూ ఎంతసేపూ ఇతరుల మెప్పుకోసం బడాయిగా సంసారాన్ని సాగించాలనుకునే స్త్రీకి ఇతను నిరాశాజనకంగా కనిపిస్తాడు.

## ఆకాశ రాకుమారుడు

❐ కొందరు యువకులు ఎప్పుడూ అతి సీరియస్‌గా ఉంటారు. తాము స్నేహం చేసే యువతితో కూడా చాలా రిజర్వ్‌డ్‌నెస్‌ని పాటిస్తారు. మాట్లాడితే తమ నోటి ముత్యాలు ఎక్కడ రాల్తాయోనన్నట్లూ, తమ రహస్యాలు ఎక్కడ బయటపడిపోతాయో నన్నట్లూ, ముభావంగా ఉంటారు.

- ఇలాంటి వ్యక్తితో స్నేహం చేసే అమ్మాయికి లేక అతనితో కాపురం చేసే స్త్రీకి అతనెంతో మిస్టరీగా కనిపిస్తాడు. ఒకో సమయాన ఆ మిస్టరీ ఒక ఆకర్షణగా కూడా పనిచేసి, అతనొక ఆకాశ రాకుమారుడిలా కనిపించే అవకాశమూ వుంది.

- సామాన్యంగా ఇలా రిజర్వ్‌డ్‌గా ఉండేవాళ్ళు ఎదుటివాళ్ళను అంత తేలికగా నమ్మరు. అంతేకాక వాళ్లలో మిగతా మనుషుల పట్ల కొంత తేలికభావమూ ఉంటుంది.
- తను ప్రేమించే లేక కాపురం చేసే స్త్రీతో కూడా అతనలా ఉంటున్నాడంటే అతడామెను పూర్తిగా విశ్వాసంలోకి తీసుకోవటం లేదనీ ఆమెకంటే అతను ఉన్నతంగా ఫీలవుతున్నాడనీ అనుకోవాలి. ఆమెపట్ల అధికారపూర్వకంగా ప్రవర్తిస్తాడనీ అనుకోవచ్చు.
- ఇలాంటి పురుషుడితో స్త్రీకి ఆంతరంగిక సహచర్యం ఏర్పడే అవకాశాలు మృగ్యం. వైవాహిక జీవితం పట్ల కొన్ని ఊహలూ కలలూ ఏర్పర్చుకున్న స్త్రీకి ఇతను ఎడారి మనిషిలా కనిపిస్తాడు. అలాకాక మగవాడు మగ మహారాజే, అతను కొంత డిగ్నిఫైడ్‌గా ఉంటేనే బాగుంటుందనుకునే స్త్రీకి ఇతను నిజంగానే ఆకాశ రాకుమారుడు.
- తన వద్ద ఆమె అతని సీరియస్ గుణాన్ని పక్కన పెట్టించగలిగితే ఆమె అద్భుతమైన అబ్బురాన్ని పొందగలుగుతుంది.

# 9



# పుస్తకాల పట్ల ప్రేమ ఏం చెబుతుంది?

(పుస్తకాల గూటిలో కుర్రవాడి ప్రేమ చిలుక!)

## Pretty Baby!

*"ఒక మనిషిని చదవాలంటే అతను చదివే పుస్తకాల్ని చూడు!"* అంటాడు ప్రముఖ రచయిత ఆల్డస్ హక్స్లే.

ఒక్క పుస్తకాల్ని చూడటమే కాదు, ఆ పుస్తకాల్ని సర్దిన తీరు, అతను చూసే సినిమాలు, వినే సంగీతం, స్పందించే తీరు, ఇవన్నీ కూడా ఆ మనిషి మనస్తత్వాన్ని తెలియజెప్పుతాయి. అతని నమ్మకాలు, అభిప్రాయాలు, విలువలు మొదలైన వాటి గురించి వివరించుతాయి.

ఇప్పుడు నీ బాయ్‌ఫ్రెండ్ చదివే పుస్తకాలు, చూసే సినిమాలు, వినే సంగీతాన్ని బట్టి అతడిలోని ప్రేమికుడు ఏ తీరున ఉండే అవకాశం ఉందో చూద్దాము.

మొదటగా అతను పుస్తకాల్ని సర్దే తీరు గురించి -



పుస్తకాల్ని రాక్‌లో సర్దటంలో రకరకాల పద్ధతులుంటాయి. సబ్జెక్ట్ వారీగా సర్దటం, అందంగా కనిపించటం కోసం సబ్జెక్ట్‌లు కలగలిసి పోయినా ఫర్వాలేదు అనుకుని సైజుల వారీగా సర్దటం, తెచ్చిన వాటిని తెచ్చినట్లుగా కలగాపులగంగా రాక్‌లో పడేయటం, పబ్లిషర్ల వారీగా సర్దటం, రచయితల వారీగా సర్దటం, ఈ రకంగా...

## సబ్జెక్ట్‌వారీగా సర్దేవాడు

❑ కొనుక్కు వచ్చిన పుస్తకాల్ని భద్రంగా సబ్జెక్ట్ వారీగా లేక రచయితల వారీగా సర్ది ఉంచే వ్యక్తి తనకు కావాల్సిన పుస్తకాన్ని అవసరమైనప్పుడు పెద్ద వెతుకులాట లేకుండా అతి సులభంగా గుర్తించి బయటకి తీయగలుగుతాడు.

- ఈ వ్యక్తి తనకు ముఖ్యమనిపించే వస్తువుల్నీ, మనుషుల్నీ ప్రేమగా అపురూపంగా చూసుకుటూ వాళ్ళ పట్ల మంచి శ్రద్ధను కనబరుస్తాడు.
- సహజంగానే అతను తను ప్రేమించే ప్రియురాలు లేక భార్య విషయంలో కూడా అంతే శ్రద్ధను కనబరుస్తాడనుకోవచ్చు.

## పుస్తకాల్ని అందంగా సర్దేవాడు

❐ సబ్జక్ట్ వారీగా కాకుండా పుస్తకం ఎత్తు, మందాన్ని బట్టి ఒక వరసలో చూడటానికి అందంగా కనిపించేట్లు సర్దే మనిషి 'పుస్తకం హస్తభూషణం' గా భావించేవాడయి వుంటాడు.

- ❍ అతనికి పుస్తకంలో విషయం కంటే దాని బాహ్యరూపం ప్రధానంగా కనిపిస్తుంది. పుస్తకాల మీద ఆసక్తి కంటే అతనికి ఇంటికి వచ్చే వాళ్ళముందు వాటిని ప్రదర్శించాలనే బడాయి, తపనే ఎక్కువగా ఉంటాయి.
- ❍ ఈ బాపతు వ్యక్తి భార్య అందానికి ఇచ్చినంత ప్రాముఖ్యతను ఆమె ఆలోచనలకూ, అంతరంగానికీ ఇవ్వడు. ఆమె మీద అతనికుండే ప్రేమ కూడా 'పైపైనే' ఉండవచ్చు తప్ప పైకి చూపించినంత గాఢంగా ఉండకపోవచ్చు!

## అడ్డదిడ్డంగా పడేసేవాడు

❐ అతని ఇంట్లోకి ప్రవేశించగానే నీకు టేబుల్ మీద కొన్ని పుస్తకాలు కనిపిస్తాయి. కిటికీలో కొన్ని పుస్తకాలు కనిపిస్తాయి. రాత్రి చదివిన పుస్తకం ఒకటి పడక మంచం మీద బోర్లా తిప్పి ఉంటుంది. ఇక షెల్ఫ్‌లో పుస్తకాలు సరేసరి, అడ్డదిడ్డంగా అడ్డగోలుగా పడేసి ఉంటాయి. ఇతనెలాంటి ప్రేమికుడు కావచ్చు?

- ❍ సామాన్యంగా అతను చదివే పుస్తకాలు మేధస్సుకు చెందినవే అయి వుంటాయి. అతనిలో ఆలోచనలు కొంచెం కిక్కిరిసి ఉండటంతో గందరగోళం ఎక్కువ.
- ❍ ఇతడు భార్యను చాలా ప్రేమగానే చూసుకుంటాడు గాని అనేక ముఖ్య సందర్భాల్ని మరిచిపోయే అవకాశం ఉంది. భార్య పుట్టినరోజును మర్చిపోవచ్చు. తమ మ్యారేజ్ డేని మర్చిపోవచ్చు, సాయంత్రం సినిమాకి వెళ్దామని చెప్పి తను వచ్చేసరికి భార్య తయారయి సిద్ధంగా ఉంటే 'ఎక్కడికి బయల్దేరబోతున్నావు?' అని అమాయకంగా అడగవచ్చు....
- ❍ ఈ రోజుల్లో వెలువడే పుస్తకాలలో ముఖ్యంగా ఆంగ్ల గ్రంథాలలో హార్డ్ కవర్, సాఫ్ట్ కవర్ - అంటే - బైండు వాల్యూమ్స్, పేపర్ బాక్స్ అంటూ వస్తున్నాయి. హార్డ్ కవర్ పుస్తకాలు దీర్ఘకాలం పాటు మన్నిక ఉంటాయి. పేపర్ బాక్స్ కూడా ఎక్కువకాలం పాటు ఉంటాయి గాని త్వరగా నలిగి చిరిగిపోయే అవకాశం ఉంది.

- ఒక వ్యక్తి తన లైబ్రరీలో హార్డ్ కవర్ పుస్తకాల్ని నిలవ ఉంచాడా లేక సాఫ్ట్ కవర్ పుస్తకాల్ని నిలువ వుంచాడా అనేదాన్ని బట్టి కూడా ఇతరుల్తో సంబంధాల్లో ముఖ్యంగా ప్రేయసి విషయంలో అతని దృక్పథం ఎలా ఉంటుందో తెలుసుకోవచ్చు.

## బైండు పుస్తకాల స్వంతదారు

❐ అతని పుస్తకాల షెల్ఫులో బైండు పుస్తకాలు ఎక్కువ కనిపిస్తుంటాయి. ఆ పుస్తకాల్ని అతను స్వయంగా బైండింగ్ చేయించటమూ కావచ్చు లేక కొన్నప్పుడే అవి బైండువీ కావచ్చు...

- ఇలాంటి వ్యక్తి శాశ్వత విలువలకు అధిక ప్రాధాన్యతనిస్తాడనుకోవచ్చు. ఇదే శాశ్వత దృక్పథం ఇతరులతో ఇతని సంబంధ బాంధవ్యాల విషయంలో కూడా కాన వస్తుంది.
- భార్య లేక ప్రియురాలి శీలానికి ఇతను బాగా ప్రాధాన్యతనిస్తాడు. పొరపాటున ఎప్పుడైనా ఆమె శీలంలో లొసుగు కనిపించినా లేక బుద్ధిలో చాంచల్యం కనిపించినా ఏ మాత్రం సహించడు. ఆమెను అవతలికి నెట్టడానికి కూడా వెనుదీయడు.

## పేపర్‌బాక్స్ నగిషీవాడు

❐ పుస్తకాల షెల్ఫ్‌లో పేపర్ బాక్స్‌ని నిలవ ఉంచేవాడు అటూ ఇటూగా సర్దుకుపో గలిగే మనస్తత్వం కలవాడై ఉంటాడు. సమకాలానికి అనుగుణంగా భావజాలాన్ని అలవర్చుకుంటాడు.

- భార్య బాహ్యారూపంకంటే అతనికి ఆమె అంతరంగం ఎక్కువ ప్రాముఖ్యంగా కనిపిస్తుంది.
- అయితే ఇక్కడొక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఈ రోజుల్లో ఒక్క లైబ్రరీలు తప్ప ఎవరూ బైండు పుస్తకాల్ని నిలవ చేసుకోగలిగేట్లు లేవు ధరవరలు. అందుకని పైన చెప్పిన రెండు విషయాల్ని (బైండు పుస్తకాలు, పేపర్ బాక్స్ కలిగి ఉండటాన్ని) మనస్తత్వపరంగా అన్వయించటం అంత సమంజసమనిపించుకోదు. అయినా కూడా ఏ వ్యక్తి అన్నా తన లైబ్రరీలో బైండు పుస్తకాల్ని నిలవచేసేడంటే మాత్రం అతని మనస్తత్వం పైన చెప్పినట్లుగా ఉంటుందని నిస్సందేహంగా అనుకోవచ్చు....

- ప్రభుత్వ గ్రంథాలయాలలో లాగా ఏ వ్యక్తి స్వంత గ్రంథాలయంలోనూ అన్ని విషయాలకు సంబంధించిన పుస్తకాలూ ఉండటం జరగదు. సామాన్యంగా ఏ మనిషి అయినా తను ఇష్టపడే తరహా పుస్తకాల్ని మాత్రమే తన గ్రంథాలయంలో నిలవ చేసుకుంటాడు.
- ఒక మనిషి తాలూకు పుస్తకాల షెల్ఫ్‌లో ఎలాంటి పుస్తకాలు ఎక్కువ డామినేటింగ్‌గా ఉంటాయో ఆ బాపతు పుస్తకాల్ని అతను ఎక్కువ చదువుతాడనుకోవచ్చు. ఉదాహరణకు కొందరు క్లాసిక్స్ ఇష్టపడవచ్చు. కొందరు డిటెక్టివ్ నవలలను ఇష్ట పడవచ్చు. కొందరు చరిత్రను ఇష్టపడవచ్చు, కొందరు వృత్తిపరమైన ప్రొఫెషనల్ పుస్తకాలను ఇష్టపడవచ్చు, ఈ రకంగా...
- ఇప్పుడు ఒక వ్యక్తికి అభిమానపాత్రమైన పుస్తకాల్ని బట్టి అతని మనస్తత్వం ఎలా ఉంటుందో చూద్దాము.

## వృత్తిపరమైన పుస్తకాలవాడు

❑ ఒక వ్యక్తి లైబ్రరీలో అత్యధిక భాగం అతడి ప్రొఫెషన్‌కి సంబంధించిన పుస్తకలుండవచ్చు. ఉదాహరణకు కంప్యూటర్ సైన్స్ చదివిన లేక చదువుతున్న వాడైతే అన్నీ కంప్యూటర్ విజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు, కామర్స్ చదివిన వాడైతే అన్నీ వ్యాపారమూ, సేల్స్‌కి సంబంధించిన పుస్తకాలు, ఇంజనీరింగ్ చదివినవాడైతే ఇంజనీరింగ్ పుస్తకాలు, ఈ రకంగా....

ఇలాంటివి తప్ప అతని షెల్ఫ్‌లో మరోరకమైన పుస్తకాలు లేకపోతే...

- అతను తన వృత్తిలో రాణించదల్చుకున్నవాడై ఉండి అందుకోసం సబ్జెక్టులో పరిపూర్ణత కోసం సాధన చేస్తుండి ఉంటాడు. ఒక్కసారిగా ధనికుడై పోవాలని కాక అంచెలంచెలుగా స్వశక్తి మీద పైకి రావాలనే తాపత్రయం కలవాడై ఉంటాడు.
- ఇలాంటి వ్యక్తి తన జీవిత సహచరిని ఎన్నుకునే విషయంలో కూడా చాలా జాగ్రత్తగా ఉంటాడు. ఆమెను అనేక కోణాల నుంచి పరిశీలించి సంతృప్తిపడ్డాకే అంగీకరిస్తాడు.
- అయితే అతనిలో ఒక లొసుగు ఉండవచ్చు. భార్యమీద కంటే అతనికి వృత్తిమీద ధ్యాస అధికంగా ఉంటుంది. కాబట్టి ఆమెను నిర్లక్ష్యం చేసే అవకాశా లెక్కువ...

## క్లాసిక్ సాహితీ పిపాసి

❒ కాలానికి నిలబడే క్లాసిక్ సాహిత్యం పట్ల మక్కువ ఎక్కువ ఉన్న వ్యక్తి సామాన్యంగా బాగా చదువుకున్నవాడై ఉంటాడు. తనకు తాను చదువుకుని (సెల్ఫ్ ఎడ్యుకేషన్ ద్వారా)కావచ్చు లేక కాలేజీల ద్వారానూ కావచ్చు.

- ఇతని ఆలోచనల్లో పరిపక్వత, హేతుబద్ధత ఉంటుంది. మరీ మేధోజీవిలా కనిపించినా కూడా ఇతను భార్యతో ఏవన్నా పొరపొచ్చాలు వస్తే సమర్థవంతంగా పరిష్కరించుకోగలుగుతాడు...

## డిటెక్టివ్ నవలా ప్రియుడు

❒ షెర్లాక్ హోమ్స్, అగాథా క్రీస్టీ, టెంపోరావ్‌లాంటి డిటెక్టివ్ నవలా రచయితల రచనల్ని చదివే వ్యక్తి ఇతరుల్ని కాస్త నిశితంగా పరిశీలిస్తుంటాడని అనుకోవచ్చు. ఇతని ఆలోచనల్లో ఎక్కువగా లాజిక్, హేతువు ఉంటాయి.

- తన జీవితానికి సంబంధించిన అన్ని విషయాల్నీ ఇతను భార్యకు చెప్పకపోయే అవకాశం వుంది. ఆమె ఊహించుకుంటుండాల్సిందే తప్ప.....

## చరిత్ర ప్రేమికుడు

❒ చరిత్ర, చారిత్రక నవలల పట్ల ముక్కువ ఎక్కువ చూపే వ్యక్తికి సహజంగానే గతం పట్ల మోజు ఉంటుంది. చరిత్ర పునరావృతమవుతుందనే సామెతను ఇతను బాగా నమ్ముతాడు.

- తన భార్య గతంలోకి చూడాలనే ఆసక్తి ఇతనికి ఎక్కువగా ఉంటుంది. జరుగుతున్న సంఘటనల్ని ఆమె గతానికి ముడిపెట్టాలనే తాపత్రయమూ ఎక్కువే.
- అయితే భార్య సంతోషించదగ్గ ఇతనిలోని ఒక సుగుణం ఏమిటంటే ఆమె తప్పులు లేక పొరపాట్లను ఇతను క్షమించేస్తుంటాడు. ఆమెతో వచ్చే చిన్న చిన్న పొరపొచ్చాలను చూసీ చూడనట్లూ ఉపేక్షిస్తుంటాడు.

## సైకాలజీయుడు

❒ సెల్ఫ్ హెల్ప్ సైకాలజీ పట్ల ఎక్కువ మక్కువ చూపే వ్యక్తి తన గురించి తాను ఎక్కువ తెలుసుకోవాలనే తాపత్రయం కలిగి ఉంటాడు. తద్వారా తనను తాను బాగు చేసుకోవాలనీ అనుకుంటాడు.

- భార్యతో లేక ప్రియురాలితో ఏవన్నా సమస్యలు వచ్చినప్పుడు వాటిని దుప్పటి కింద దాచి ఉంచడం కంటే హృదయం విప్పి అన్ని కోణాల నుంచీ చర్చించు కోవడం ఉత్తమమని భావిస్తాడు.
- మార్కెట్లో కనిపించే ప్రతి సైకాలజీ పుస్తకాన్ని కొనుక్కువచ్చే ఇతనితో భార్య లేక ప్రియురాలికి వచ్చే ఇబ్బంది ఏమిటంటే ప్రతి విషయాన్ని ఇతను మరీ విశ్లేషణాత్మకంగా చూస్తాడు. ఆమె జీవితంలో అతిగా ఇన్వాల్వ్ అవుతాడు.

## అన్ని రకాల పుస్తకాలూ చదివేవాడు

❒ ఒక సబ్జెక్ట్ అంటూ కాకుండా అన్ని రకాల పుస్తకాల్ని కొని, దాచుకుని చదివే మనిషి జీవితానికి సంబంధించిన అన్ని విషయాల పట్ల ఆసక్తిని కలిగి ఉంటాడు.

- అన్ని విషయాల పట్లా ఉండే క్యూరియాసిటీ ఇతనిలోకి ఓర్పునీ పరిపక్వతనీ తీసుకువస్తుంది. తద్వారా ఇతను భార్యతో సంబంధాలలో పట్టువిడుపుల్ని ప్రదర్శించ గలిగే శక్తిని సంతరించుకుంటాడు.
- అన్ని విషయాలనూ విపరీతంగా చదివే ఈ వ్యక్తి ప్రపంచాన్ని విశాల దృక్పథంతో చూడగలుగుతాడు. ఇంత పరిజ్ఞానంతో ఉండే ఇతను భార్యకు మాత్రం సంక్లిష్టంగా కనిపించే అవకాశం ఉంది.

# 10



# ఇష్టపడే సంగీతం, సినిమాలు, పెయింటింగ్స్ ఏం చెబుతాయి?

( మీ హీరో ప్రేమ హిట్టో, ఫ్లాపో తెలుసుకోవాలంటే.. )

సంగీతాన్ని దేవతల భాష అంటారు. దానికి ఒక ప్రాంతంతో, మతంతో సంబంధం లేదు. సంగీతంలో మనుషుల మూడ్స్, ఉద్వేగాలు ప్రతిఫలిస్తుంటాయి. ఏ ఒక్క సంస్కృతి సంగీతమూ మరో సంస్కృతి సంగీతానికి తీసిపోదు.

అయితే ఒకో మనిషికి ఒకో రకపు సంగీతం నచ్చుతుంది. ఒక మనిషికి సన్నగా మృదుమధురంగా ఆకాశాన్నుంచి జాలువారే వర్షగీతంలా వుండే సంగీతం ఇష్టమయితే, మరొక వ్యక్తికి ధమధమా ఫెళాఫెళా వినిపించే ఉరుముల్లాంటి సంగీతం ఇష్టం కావచ్చు.

ఒక వ్యక్తి ఎలాంటి సంగీతాన్ని ఇష్టపడతాడనేది అతనిలోని ఒక భాగపు వ్యక్తిత్వానికి సూచన కూడా!

ఇప్పుడు ఒక వ్యక్తి ఇష్టపడే సంగీతాన్ని బట్టి అతనిలోని 'ప్రేమికుడు' ఏ రకంగా ఉంటాడో చూద్దాము.

**రెడీయేనా రాచిలుకా?**

## శాస్త్రీయ రాగాల్ని ఇష్టపడేవాడు

❒ బిస్మిల్లాఖాన్ షెహనాయి, శివకుమార్ శర్మ సంతూర్, ఆలీ అక్బర్‌ఖాన్ సరోదధ్వని, ఈమని వీణారవం, టి.ఆర్. మహాలింగం వేణునాదం లాంటి శాస్త్రీయ సంగీతానికి పరవశించిపోయే వ్యక్తి అతి సున్నితుడు, అంతర్ముఖుడు, పరిపక్వ మేధోజీవి అయి ఉంటాడు. (పరవశిస్తున్నట్లుగా 'నటించే' వ్యక్తికి ఇది అన్వయించదు!)

- ఈ వ్యక్తి సహజంగానే కాలానికి నిలిచే సహజసిద్ధ సాహిత్యాన్ని, కళాఖండాలనదగ్గ పెయింటింగ్స్‌నీ కూడా ఇష్టపడతాడు.
- ఇలా శాస్త్రీయ సంగీతానికి ట్యూనప్ అయి వుండే వ్యక్తి తన స్త్రీ పట్ల అతి ప్రేమ వున్నా కూడా దానిని బడాయి కోసమో ఆమె మెప్పుకోసమో 'ప్రేయసీ రూపసీ' అంటూ ఆమె ముందు ప్రదర్శించడు.
- ఆ ప్రేమ తాలూకు అనుభూతులు అతనిలో కదులుతుంటాయి, ఆ అనుభూతుల్ని అతను తన చూపులద్వారా, అప్పుడప్పుడూ ఒకటీ అరా మాటల ద్వారా బహిర్గతపరచి ఆమెను ఆనందపరుస్తుంటాడు.

## డిస్కో ధమధమాన్వితుడు

❒ ఈ రోజుల్లో ధడధడా చప్పుళ్లు చేసే డిస్కో, బ్రేక్ డాన్సుల తాలూకు సంగీతాల క్యాసెట్లు వస్తున్నాయి. ముఖ్యంగా విదేశీవి! ఈ సంగీతాన్ని వింటున్నప్పుడు దాని పట్ల ఏ కొంచెం ఆసక్తి కలవాళ్ళయినా గాని వాళ్ళ కాళ్ల స్టెప్స్ కదులుతుంటాయి. గుండెల్లో ఉద్వేగభరితపు కొత్తలోకాలకు తలుపులు తెరుచుకుంటాయి.

- ఈ బాపతు సంగీతాన్ని అభిమానించే వ్యక్తి 'హృదయంలో' యౌవనం జవజవ లాడుతూ తొణికిసలాడుతుంటుంది. అతని జీవనశైలి మిగతా మనుషుల కంటే స్వేచ్ఛాయుతంగానూ శక్తిపూరితంగానూ ఉంటుంది.
- ప్రేమ, సెక్సు, వివాహం మొదలైన వాటికి సంబంధించి అతను సమకాలీన సమాజపు భావజాలానికి అనుగుణంగా తనను తాను మల్చుకునే వ్యక్తి అయి ఉంటాడు.
- జీవనసహచరి కూడా అతని అభిరుచికి అనుగుణంగా అలాంటి సంగీతాన్నే ఇష్టపడే మనిషయితే వాళ్ళిద్దరి జీవితం చిలకాగోరింకల్లా సాగిపోతుంది.

## జానపద సంగీత ప్రియుడు

❒ కొందరు జానపద సంగీతాన్నీ గీతాల్నీ పిచ్చిగా అభిమానిస్తుంటారు. ఇలాంటి వ్యక్తిని కొంచెం బోళా పురుషుడుగా అనుకోవచ్చు.



- తను ప్రేమించిన ప్రియురాలి వద్ద అతను నటన లేకుండా నిజాయితీగా ప్రవర్తిస్తాడు. హృదయం విప్పి కల్మష రహితంగా మాట్లాడతాడు.
- జీవితంలో డబ్బుగానీ, కీర్తిగానీ సంపాదించాలనే గొంతెమ్మ కోర్కెలేమీ ఉండవతనికి, చాలా సాదాసీదా మనిషి.
- అంతే సాదాసీదాగా భార్యవద్ద ప్రియురాలి వద్ద కూడా ప్రవర్తిస్తాడు. ఆమెకు కూడా పెద్దగా ఆశలు, ఆడంబరాల పట్ల మోజులు లేకపోతే అతనితో ఆమె జీవితం అతి సౌఖ్యవంతంగా గడిచిపోతుంది.

## స్క్రీన్ టెస్ట్

- ఇప్పుడిక స్క్రీన్ టెస్టులోకి వద్దాము. అంటే అతను ఇష్టపడే సినిమాలు అతనిలోని ఎలాంటి మనస్తత్వాన్ని తెలియజేస్తాయో చూద్దాము -
- ఈ రోజుల్లో తెలుగులోనైతేనేమీ, హిందీ లేక ఆంగ్లంలో నైతేనేమీ రకరకాల సినిమాలు వస్తున్నాయి. సీరియస్ సినిమాలు, కామెడీవి, ఫైటింగ్‌వి (అంటే యాక్షన్‌వి), హారర్‌వి, ఈ రకంగా... ఒకో వ్యక్తికి ఒక్కో తరహావి నచ్చుతాయి.
- గాళ్‌ఫ్రెండ్ సినిమాకు వెళ్దామనగానే పలానా దానికి వెళ్దామంటూ బాయ్‌ఫ్రెండ్ ఎక్కువ సందర్భాలలో సూచించే తరహా సినిమాలను బట్టి రేపతను తనతో ఎలా ప్రవర్తిస్తాడో ఆమె ఒక అవగాహనకు రావచ్చు.

## పూర్వపు సినిమా కళాఖండాలు

❑ కొన్ని విలువలకు కట్టుబడి ఉండే పాత సినిమా కళాఖండాలు నాగయ్యవీ, విజయా వాహినీ సినిమాలు, శాంతారాం, గురుదత్, బిమల్‌రాయ్, మెహబూబ్ ఖాన్‌ల సినిమాల్ని ఇష్టపడే వ్యక్తి సమకాలీన జీవితంలో సమకాలీన విలువలతో అసంతృప్తి చెంది వుండి, రాజీ పడలేకపోతున్నవాడై ఉంటాడు. ప్రస్తుత సమాజంలో ఇమడటానికి ఇబ్బంది పడుతున్నవాడై కూడా ఉంటాడు.

- ఇలాంటి వ్యక్తి తనతో జీవితాన్ని పంచుకునే స్త్రీలో పాత విలువలకు సంబంధించిన సౌశీల్యము, సంప్రదాయము, అణకువ లాంటి లక్షణాలు ఉండాలని కోరుకుంటాడు.
- ఆమెతో సంబంధ బాంధవ్యాల విషయంలో ప్రస్తుత కాలానికి సంబంధించి కొంత వాస్తవ విరుద్ధంగా కూడా ఆలోచిస్తుంటాడు.
- ఆమె మరీ మాడ్రన్ గాళ్ అయితే అతనికి ఎడంగా ఉండటం మంచిది.
- ఆధునిక లక్షణాలు అంటని సంప్రదాయిక అమ్మాయి ఇతనికి సరిజోడీ!

## డిష్యుం డిష్యుం యాక్షన్ సినిమాలు

❑ ఇలాంటి సినిమాల్ని ఇష్టపడేవాడు తన అభిమాన హీరోలోని సర్వసమర్థ సాహసోపేత లక్షణాల్ని ఇష్టపడుతుంటాడు. అంతర్గతంగా తనలోని శక్తిహీన పిరికి లక్షణాలకు సిగ్గిలుతూ వాటిని దాచుకోవటానికి ప్రయత్నిస్తుంటాడు.

- జీవితపు ఫ్రస్ట్రేషన్ తాలూకు కోపతాపాల్ని ఫైటింగ్ సినిమాల్ని చూడటం ద్వారా, ఆ ఫాంటసీలోకి వెళ్ళిపోవడం ద్వారా అతను రిలీజ్ చేసుకుంటాడు.
- ఇలాంటి మనిషి భార్య లేక ప్రియురాలి వద్ద మాత్రం తన 'పురుషత్వ' ప్రతాపాన్ని రుజువు చేసుకునే ప్రయత్నాలలో ఉంటాడు.

## భయానక సినిమాలు

❑ భయానక సినిమాల్ని ఇష్టపడే వ్యక్తిలో మానసికంగా టీనేజ్ లక్షణాలు ఉంటాయి. తనమీద తనకు అవగాహన, నమ్మకం లేకపోవటం, నెర్వస్‌గా ఉండటం మొదలైనవి!

- భార్య లేక ప్రియురాలి వద్ద ఇతను రిలాక్స్‌డ్‌గా ఉండలేడు. 'నువ్వంటే నాకు భయంలేదు సుమా' అన్నట్లు కృత్రిమంగా ప్రవర్తిస్తాడు ఆమెతో.

- భయానక సినిమాల్ని ఇష్టపడే వాళ్ళలోనే కొద్దిమంది మరో రకం వాళ్ళు కూడా ఉంటారు. వాళ్ళు ఆయా సినిమాలలోని విక్టిమ్స్ (బాధితుల) స్థానంలో తమను ఊహించుకుంటారు.
- జీవితంలో తమకెంతో అన్యాయం జరిగి పోయిందనీ, ఫలానా వాళ్లు తమను వాడుకున్నారనీ, ఫలానా వాళ్లకు తాము బలి అయిపోయామనీ వాపోతుంటారు. గత కాలంలో తనను ఫలానా స్త్రీ మోసం చేసిందంటూ వాళ్ళు భయంకరంగా గోరంతల్ని కొండంతలు చేసి వర్ణిస్తుంటారు.
- బాయ్‌ఫ్రెండ్‌లో ఇలాంటి లక్షణం కనిపిస్తే గర్ల్‌ఫ్రెండ్ కొంచెం జాగ్రత్తపడటం మంచిది.

## కామెడీ సినిమాలు

❏ కామెడీ సినిమాల్ని ఇష్టపడే వ్యక్తిలో సెన్సాఫ్ హ్యూమర్ జోరుగా ప్రవహిస్తుం టుంది. స్త్రీ పురుష సంబంధాలు మెరుగుపడి పటిష్టపడటానికి ఈ లక్షణం అద్భుతంగా ఉపకరిస్తుంది.

❏ సామాన్యంగా ఇతను ఆశాజీవి అయి ఉండి జీవితాన్ని ఎంజాయ్ చేస్తుంటాడు. ఇతనితో వచ్చే ఇబ్బంది ఏమిటంటే సీరియస్ ఉద్వేగాలు ఇతనికి అర్థం కావు, పట్టించుకోడు.

- ఒకవేళ ఎప్పుడైనా ఇతను మానసికంగా గాయపడ్డా లేక దెబ్బతిన్నా ఆ అనుభూతుల్ని హాస్యం మాటున దాచుకోవడానికి ప్రయత్నిస్తాడు.
- ఇతనితో జీవితాన్ని పంచుకునే స్త్రీ కూడా ఇతనిలోని ఈ లక్షణాన్ని ప్రతిఫలించగలిగితే వాళ్ళ జీవితం నందనవనమే అవుతుంది.

## పెయింటింగ్స్ ప్రియత్వం మాటున...

❏ కొందరికి గోడలకు తగిలించుకునే పెయింటింగ్స్, కళాఖండాల పట్ల మక్కువ ఎక్కువ ఉంటుంది.

❏ ఒక వ్యక్తికి ఫలానా రకం పెయింటింగ్స్, బొమ్మలు, ఫోటోలు మొదలైనవి ఇష్టంగా ఉంటున్నాయి అంటే అవి అతడి హృదయాన్ని స్పృశించి ఆకట్టుకుంటున్నాయి అనుకోవచ్చు. అతని ఆ అభిరుచిని బట్టి అతని మనస్తత్వం ఎలాంటిదో, ప్రియురాలితో ఎలా స్పందిస్తాడో ఇక్కడ ఇచ్చిన క్విజ్ ద్వారా తెలుసుకోవచ్చు.

# ఒక క్విజ్

○ ఏ యువతి అయినా తన బాయ్‌ఫ్రెండ్‌కి సంబంధించి ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాల్ని చెప్పడం ద్వారా అతనెలాంటి వాడో భవిష్యత్తులో తనతో ఎలా మెలిగే అవకాశం ఉందో తెలుసుకోవచ్చు -

○ ఈ ప్రశ్నలు ఒక్క పెయింటింగ్స్‌కి సంబంధించినవే కాక ఈ రోజుల్లో చవగ్గానూ, ఖరీదులోనూ కూడా ఆర్ట్‌పీస్‌ల కింద రకరకాల విగ్రహాలు వస్తున్నాయి. బాయ్‌ఫ్రెండ్ ఇష్టపడే లేక తన గదిలో అమర్చుకునే అలాంటి వాటిని కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

## ప్రశ్నలు

1. *గోడలకు కుటుంబసభ్యులు, మిత్రుల ఫోటోలను తగిలించుకుంటాడా?*
   *అన్నీ అవే / చాలాభాగం / కొన్ని / అతికొద్ది మాత్రం / అసలుండవు*
2. *అతని వద్ద ఉండే బొమ్మలు, పెయింటింగ్స్‌లో సెక్స్‌నీడలు కనిపిస్తుంటాయా?*
   *అన్నిటిలోనూ / చాలావాటిలో / కొన్నిటిలో / అతికొద్ది వాటిలో / అసలుండవు*
3. *ఆ బొమ్మలూ, చిత్తరువులూ డల్‌గా కాక ఆహ్వానపూరితంగా ఆకట్టుకునేట్లు వుంటాయా?*
   *అన్నీ / చాలా / కొన్ని / అతి కొద్ది / అసలుండవు.*
4. *అవి హాస్యభరితంగా లేక తమాషాగా ఉంటాయా?*
   *అన్నీ / చాలాభాగం / కొన్ని మాత్రం / అతి కొద్దిటిలో / అసలుండవు*
5. *అవి ఆహ్లాదకరంగా ఉంటాయా?*
   *అన్నీ / చాలాభాగం / కొన్ని మాత్రం / అతికొద్దిగా / అసలుండవు*
6. *అవి భయపెడుతున్నట్లో, బెదిరిస్తున్నట్లో కాకుండా ప్రశాంత వాతావరణాన్ని కల్పిస్తుంటాయా?*
   *అన్నీ / చాలాభాగం / కొన్ని మాత్రం / అతికొద్ది / అసలుండవు*
7. *వాటిలో ముఖాలు గానీ శరీరభాగాలు కానీ వికారంగా కాకుండా ఆకర్షణీయంగా ఉంటాయా?*
   *అన్నీ / చాలాభాగం / కొన్నిటిలో మాత్రం / అతి కొద్ది వాటిలో / అసలుండవు*

8. ఆ బొమ్మలూ, పెయింటింగ్స్ ఒకే స్టయిల్ (తరహా) వి కాకుండా అన్ని రకాలతో బాలెన్సింగ్‌గా ఉంటాయా?

అవును / కాదు

9. అవి రాత్రిళ్ళు పీడకలలు తెప్పించేవి కాకుండా అందమైన కలలకు ప్రేరకాలుగా ఉంటాయా?

అన్నీ / చాలాభాగం / కొన్ని మాత్రం / అతి కొద్ది / అసలుండవు

10. ఆ పెయింటింగ్స్ నీడలతో నిరాశాజనకంగా కాకుండా మెరుపు రంగులతో, ఆశాజనకంగా ఉంటాయా?

అన్నీ / చాలాభాగం / కొన్నిమాత్రం / అతికొద్ది / అసలుండవు

**మార్కులు :**

○ పై సమాధానాలకు టిక్కు పెట్టిన వాటిలో ఒక్కొక్కదానికి ఈ రకంగా మార్కులు వేసుకోవాలి.

అన్నీ-4, చాలాభాగం-3, కొన్నిమాత్రం-2, అతికొద్ది-1, అసలుండవు-0. (ఒక్క 8వ ప్రశ్నకు మాత్రం అవునుకి-4, లేదుకు-0 మార్కులు వేసుకోవాలి.)

ఇప్పుడు మొత్తం వచ్చిన మార్కులు చూసుకోండి :

**31 నుండి 40 మధ్య వస్తే...**

○ ఇతను మంచి ఉత్సాహంగా ఉండే ఆశాజీవి. ప్రియురాలిని లేక భార్యను చాలా ప్రేమగా చూసుకుంటాడు. ఉద్వేగాల ఛాయలేవీ ఇతడి మనసుని దరిచేరవు.

ఇతనికి గభాల్న కోపం వస్తుందనే భయంలేదు. ఎప్పుడూ ప్రశాంత చిత్తంతో ఉంటాడు. జీవన సౌందర్యాన్ని ఆస్వాదిస్తాడు. తను ప్రేమించే ప్రియురాలు లేక భార్యను మెచ్చుకుంటూ సంతోషపెడతాడు తప్ప విమర్శలతో గాయపరచడు.

**21 నుంచి 30 మధ్య వస్తే.....**

○ మనిషి మంచివాడే గాని తరచుగా ఉద్వేగాల ఉప్పెనలో కొట్టుకుపోతుంటాడు. కొందరు స్త్రీలకు ఇలాంటివాళ్ళే ఆకర్షణీయంగా కనిపిస్తారు. అతడి అభిప్రాయాలతో ఏకీభవించే స్త్రీకి అతను మంచి రొమాంటిక్ పార్టనర్ అవుతాడు.

**11 నుండి 20 మధ్య వస్తే.....**

○ ఇతనిది కొంచెం సంక్లిష్ట మనస్తత్వం. ఒకసారి ఉత్సాహంగా ఆశావహంగా ఉంటే మరోసారి నీరసంగా నిరాశాజనకంగా ఉంటాడు. ఇతనిలో తెలియని కోపం

ఏదో రగులుతుంటుంది. మిస్టరీతో కూడుకున్న మూడీ మనిషి. ఒకరోజు ప్రియురాలికి పూలు తెచ్చి ఇచ్చి ఆశ్చర్యపరచి సంతోషపెడితే మరో రోజు పరుషపదాలతో ఆమెను తూట్లు పొడుస్తాడు. ఇతనితో సర్దుకుపోవటం ఆమెకు సవాలుగానే ఉంటుంది.

10 లోపు మార్కులు వస్తే.....

○ ఇతను మనుషుల్ని నమ్మడు. వాళ్ళలో చెడును చూస్తాడు. ఎంతసేపూ మనుషులకు ఎడంగా ఉంటాడు. ఇతనితో జీవనం ప్రియురాలికి దుస్సహంగానే ఉంటుంది. తర్వాత చింతించటం కంటే ముందే ఆమె అతనికి దూరంగా జరగటం మంచిది.

# 11



# స్నేహితుల్ని బట్టి అతడి మనస్తత్వం

( నేస్తాలతో అతడి సంబంధ బాంధవ్యాలు
నీతో నెరపబోయే అతని ప్రేమకు కొలమానాలు!)

ఒక అమ్మాయితో స్నేహం చేస్తున్నప్పుడు లేక ప్రేమలో పడ్డప్పుడు, ఏ పురుషుడయినా ఆమె దృష్టిలో మంచివాడుగా కనిపించడం కోసం తనకు చాతనయినంత డీసెంట్‌గా కనిపించటానికి ప్రయత్నిస్తాడు. ముఖ్యంగా ప్రారంభదశలో ఇది మరీ!

సహజంగానే ఆ సమయాన ఆమెకు అతడి అసలు వ్యక్తిత్వమూ అసలు మనస్తత్వమూ కంటే నకిలీ మనస్తత్వమూ నకిలీ వ్యక్తిత్వాలు ఎక్కువగా కనిపించే అవకాశం ఉంటుంది.

మరి ఆమె అతడి అసలు వ్యక్తిత్వాన్ని తెలుసుకోవటం ఎలాగ?

○ మిత్రులతో అతడి సంబంధ బాంధవ్యాలను తెలుసుకోవటం ద్వారా ఆమె అతడిలోని అసలు మనస్తత్వాన్ని పట్టుకోవటానికీ తద్వారా అతడు తనకు సరిజోడీ అవుతాడో లేదో తెలుసుకోవటానికీ కొంతలో కొంత వీలు కుదిరే అవకాశం ఉంది.

అయితే ఒకటి -

○ ఆమె ఎల్లవేళలా అతడి వెంట ఉండదు కాబట్టి ఆ విషయాన్ని తెలుసుకోవటం ఏమంత తేలికైన సంగతి కాదు. అలా తెలుసుకోవటం కోసం ఆమె సమయం చూసి అతణ్ణి అతని మిత్రులకు సంబంధించిన ప్రశ్నలడగవచ్చు.

○ సందర్భవశాత్తూ వాళ్ళు తన ముందు అతణ్ణి కలిసినప్పుడు అతను వాళ్లతో ఎలా ప్రవర్తిస్తున్నాడు, వాళ్ళ పట్ల అతని స్పందన, అభిప్రాయాలు, ఎలా ఉన్నాయి మొదలైన విషయాలను తెలుసుకోవచ్చు.

అందుకోసం ఇక్కడ ఒక క్విజ్ లాంటి దానిని ఇస్తున్నాను.

○ ఈ కింద వరసగా ఇవ్వబడ్డ స్టేట్మెంట్స్ మిత్రులకు సంబంధించి అతడి పాజిటివ్ ధోరణికి చెందినవి. ఆ పక్కనే బ్రాకెట్‌లో ఇవ్వబడ్డ స్టేట్మెంట్స్ అందుకు పూర్తిగా విరుద్ధమైన నెగటివ్ ధోరణికి చెందినవి.

○ ఒకమ్మాయి తన బాయ్‌ఫ్రెండ్‌కి సంబంధించి ఆ రెంటిలో ఏ స్టేట్మెంట్ అన్వయిస్తుందో దానికి అనుగుణంగా మార్కులు వేసుకోవాలి. ఆ మార్కుల్ని ఈ విధంగా ఉండాలి.

పాజిటివ్ స్టేట్మెంట్‌కి - 5,

నెగటివ్ స్టేట్మెంట్‌కి - 0

అయితే కొన్ని సందర్భాలలో పాజిటివ్ స్టేట్మెంట్ పూర్తి శాతంగా అతడికి అన్వయించకపోవచ్చు. అందులో ఏ కొద్ది శాతంగా మాత్రమే అన్వయించవచ్చు. అలాంటప్పుడు ఆ అన్వయించే ధోరణిని బట్టి మార్కుల్ని ఈ కింది విధంగా వేసుకోవాలి.

1. పూర్తి పాజిటివ్ స్టేట్మెంట్ - 5 మార్కులు (పైన చెప్పిన విధంగా)
2. 80 శాతం పాజిటివ్ స్టేట్మెంట్ - 4 మార్కులు
3. 60 శాతం పాజిటివ్ స్టేట్మెంట్ - 3 మార్కులు
4. 40 శాతం పాజిటివ్ స్టేట్మెంట్ - 2 మార్కులు
5. 20 శాతం పాజిటివ్ స్టేట్మెంట్ - 1 మార్కు
6. నెగటివ్ స్టేట్మెంట్ - 0 మార్కులు (పైన చెప్పిన విధంగా)

## క్విజ్

| పాజిటివ్ స్టేట్‌మెంట్ | నెగటివ్ స్టేట్‌మెంట్ |
|---|---|
| 1. అతడు నిన్ను తన మిత్రులకు పరిచయం చేస్తుంటాడు. | ○ అతడు తన మిత్రులెవరికీఅసలు నిన్ను పరిచయం చేయడు. |
| 2. తరచుగా అతడు తన మిత్రులను కలుస్తుంటాడు. | ○ అతడి మిత్రులే అతడి కోసం వెతుక్కుంటూ రావాలి. |
| 3. అతడి మిత్రులు అతడిని అవసరాలలో ఆదుకునేవాడుగా భావిస్తుంటారు. | ○ మిత్రులకు అతనేనాడూ సహాయం చేయడు. |
| 4. అతనికి ఆడ, మగ, రెండు జాతులలోనూ స్నేహితులున్నారు. | ○ అతనికి ఆడ లేక మగ ఒక జాతికి సంబంధించిన స్నేహితులే ఎక్కువగా కనిపిస్తుంటారు. |
| 5. ఇతరులు చెప్పే కథల్నీ విషయాల్నీ వినటానికి అతను బాగా మక్కువ చూపుతాడు. | ○ ఇతరులు మాట్లాడడానికి వీలులేకుండా తనే ఎక్కువ మాట్లాడుతాడు. |
| 6. తన మిత్రులు సాధించే విజయాల్ని చూసి అతను అమితంగా సంతోషిస్తాడు. | ○ మిత్రులు సాధించే విజయాల్ని చూసి అతను ఈర్ష్య చెందుతుంటాడు. |
| 7. తన విజయాల గురించి గొప్పలు చెప్పుకోడు. | ○ తన విజయాల గురించి ఒకటే గొప్పలు చెప్పుకుంటాడు. |
| 8. పార్టీలు, ఫంక్షన్లు ఎప్పుడు జరుగుతాయా అని ఎదురుచూస్తుంటాడు. | ○ పిలిచారు కదా అని మొహమాటానికి మాత్రమే ఫంక్షన్లలో పాల్గొంటాడు. |
| 9. మనుషుల మొహాలనూ పేర్లనూ గుర్తుంచుకుంటాడు. | ○ ఒకటి రెండు సార్లు కలిసిన మనుషుల పేర్లు అతనికి అంతగా గుర్తుండవు. |
| 10. ఎవరినన్నా కలుస్తానని అపాయింట్‌మెంట్ ఇచ్చిన టైముకి తప్పనిసరిగా కలుస్తాడు | ○ చెప్పిన టైముకి కాక అలస్యంగా కలుస్తాడు. |

| | | |
|---|---|---|
| 11. | ఇబ్బందులలో ఉన్న మిత్రులు, కుటుంబ సభ్యులను ఆదుకోవటానికి రూల్సుని అతిక్రమించటానికి కూడా వెనుకాడడు. | ○ మిత్రులుగానీ,కుటుంబసభ్యులు గానీ సహాయం చేయమని అతణ్ణి వేడుకోవాలే తప్ప అతనికతను పూనుకోడు. |
| 12. | సాటివాళ్ళ దృక్పథాల్ని, కష్టాల్నీ అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తాడు. | ○ తన ధోరణి, తన దక్కోణం తనదే తప్ప ఇతరుల్ని అర్థం చేసుకోవటానికి ఏ మాత్రం ప్రయత్నించడు. |
| 13. | అనేకమందికి అతను ఆత్మీయుడు. | ○ ఇతరులతో అతని పరిచయాలూ స్నేహాలూ మొక్కుబడివిమాత్రమే. |
| 14. | అతనికి స్నేహితులలో చాలామంది నాలుగయిదు సంవత్సరాల పూర్వం నుంచే అతనికి స్నేహితులు. | ○ అతని స్నేహితులంతా ఈ మధ్య ఏర్పడ్డవాళ్ళే. |
| 15. | ఇతరులు చేసే తప్పుల గురించి అతను అందుకేదో కారణం ఉండవచ్చునన్నట్లు బెనిఫిట్ ఆఫ్ డౌట్ నుంచి ఆలోచిస్తాడు. | ○ ఇతరుల తప్పుల్ని అతను నిర్దయగా ఖండించేస్తాడు. |
| 16. | తనకేదన్నా అవసరం వచ్చినప్పుడు మిత్రులకు చెప్పుకుని సేద తీర్తాడు. | ○ నిరాశా నిస్పృహల్ని మౌనంగా భరిస్తాడు. |
| 17. | తను అనుకున్నది అనుకున్నట్లుగా జరగనప్పుడు మరోమారు మరోవేపు నుంచి ప్రయత్నించి చూస్తాడు. | ○ అనుకున్నది అనుకున్నట్లుగా జరగకపోతే కుంగిపోతాడు. |
| 18. | తరచుగా క్రమం తప్పకుండా అతను మిత్రులకు పార్టీలు, డిన్నర్లు ఇస్తాడు. | ○ హమేషా అతను ఇతరులకు అతిథి కాని ఏనాడూ అతనికతను పార్టీలు గాని డిన్నర్లు గానీ ఇచ్చి ఎరుగడు. |
| 19. | పండగలు, బర్త్‌డేలు, వివాహ వార్షిక దినాలు మొదలైన సందర్భాలలో అతను మిత్రులకు గ్రీటింగ్ కార్డులూ, గిఫ్టులూ పంపుతుంటాడు. | ○ అలాంటి ముఖ్య సందర్భాలేవీ అతనికి గుర్తు ఉండవు, పాటించనూ పాటించడు. |
| 20. | నిత్యం అతను మిత్రులను కలుస్తుంటాడు. | ○ వంటరిగా ఉండడం అతనికి ఎక్కువ ఇష్టం. |

ఇరవై స్టేట్‌మెంట్లకీ కలిపి మొత్తం ఎన్ని మార్కులు వచ్చాయో చూడండి.

**81 నుంచి 100 మార్కులు వస్తే...**

○ *నిజాయితీ, నమ్మకం కల ఏ కల్మషమూ లేని వ్యక్తి ఇతను. ఎప్పుడూ మనుషులతో కలిసి ఉండాలనే తాపత్రయం కలవాడు. అవసర సమయాలలో సాటివాళ్ళకు స్నేహహస్తం చాచే మనస్తత్వం. తనకు తాను సెక్యూరిటీని ఫీలవుతూ తనతో జీవితం గడిపే అమ్మాయిని తన స్నేహమాధుర్యంలో వికసించనిస్తాడు.*

**61 నుంచి 80 మార్కులు వస్తే...**

○ *జీవితం పట్ల ఆసక్తి, పాజిటివ్ దృక్పథం ఉంటాయితనికి. తన జీవన సహచరి పట్ల శ్రద్ధ కలిగిఉండి ఆమె మంచిచెడులను తనవిగా చూసుకుంటాడు. స్నేహానికి విలువ ఇస్తాడు. స్నేహం, ప్రేమ ఈ రెంటికీ ప్రాధాన్యతనిచ్చినా కూడా అతని జీవితంలో మరేవో ఇతర ప్రాధాన్యతలు కూడా బాగానే ఉంటాయి.*

**41 నుంచి 60 మధ్య మార్కులు వస్తే...**

○ *ఇతరులతో ఇతని సంబంధ బాంధవ్యాలు లాభనష్టాల బేరీజు మీద నడుస్తుంటాయి. అవతలి వాళ్ళు తనకెంత ఇచ్చారో తను వాళ్ళకు అంతే ఇవ్వటానికి సిద్ధంగా ఉంటాడు. ప్రేమవిషయంలో కానీండి, స్నేహం విషయంలో కానీండి. భార్య తనకెంత ప్రేమనందిస్తోందో అతనూ ఆమెకు అంత మాత్రం ప్రేమనే అందిస్తాడు. ఆమె అతనిపట్ల అధిక ప్రేమను చూపించటం ద్వారా అతని నుంచి ఎక్కువ ప్రేమను పొందవచ్చును.*

**21 నుంచి 40 మధ్య మార్కులు వస్తే ...**

○ *ఇతను కొంచెం వంటరితనాన్ని ఇష్టపడే మనిషి. భార్యకైనా గానీ ఇతడితో చనువును పెంపొందించుకోవటం కాస్త కష్టసాధ్యమైన విషయమే. ఆమె ఎంత మొండిపట్టు మనిషి అయినా అతని అంతరంగంలోకి కొంతమేరకు మట్టుకే చొచ్చుకుపోగలదు.*

**20 లోపు మార్కులు వస్తే...**

○ *ఇతను పూర్తిగా అసామాజికుడు. ఎవరితోనూ కలవడు, కలవాలన్న ఇచ్ఛా ఉండదు. తన ఉద్వేగ గుడిసెలో తను ముడుచుకుని దాక్కుంటాడు. ఆడపిల్ల ఇతనికి దూరంగా ఉండటం మంచిది. (అసలతను దగ్గరకు రానిస్తే కదా?!)*

## స్నేహితుల్ని ఎలా పంచుకుంటారు?

❐ ఒక అబ్బాయి, ఒక అమ్మాయి స్నేహం చేస్తున్నప్పుడు వాళ్ళకు మొట్టమొదటగా ఎదురయ్యే ప్రశ్న - ఒకరి మిత్రులతో ఒకరు ఎలా డీల్ చేయాలి అనేది!

- కొందరు ఎదుటివాళ్ళ మిత్రుల్ని కూడా తమ మిత్రులుగానే భావించితే మరి కొందరు ఎవరి ప్రైవసీ వారికి ఉండాలనీ ఎవరి స్నేహితులు వాళ్ళకే పరిమితమై ఉండాలనీ భావిస్తారు.
- అయితే ఈ విషయంలో పాటించదగ్గ రూల్సంటూ ఏమీ ఉండవు కానీ బాయ్‌ఫ్రెండ్‌కి సంబంధించి చూసినప్పుడు అతడు తన మిత్రుల విషయంలో ఆమెతో ఎలా ప్రవర్తిస్తాడో అది అతడి మనోగతాన్ని తెలియజేయటం సహజం! ఇప్పుడా వివరాల గురించి చూద్దాము.

## మిత్రుల్ని పంచుకుందామనేవాడు

❐ నీ మిత్రులు నాకూ మిత్రులే, నా మిత్రులు నీకూ మిత్రులే అన్నట్లు ప్రవర్తించే వ్యక్తి ఉదారస్వభావుడు, ప్రియురాలి పట్ల మంచి గౌరవభావం కలవాడూ అయి ఉంటాడు.

- సంవత్సరాల నుంచీ తను సంపాదించుకున్న స్నేహితులను ప్రియురాలికి పరిచయం చేయటంలో గర్వాన్ని ఫీలవుతూ ఆమెను వాళ్ళకు పరిచయం చేయటంలో గొప్పను ఫీలయేవాడు తన జీవితంలోకి ఆమెను హృదయపూర్వకంగా ఆహ్వానిస్తున్నట్లే లెక్క!
- ప్రియురాలి స్నేహితుల పట్ల ఆసక్తి ప్రదర్శించటం ఆమె పట్ల ఆసక్తిని ప్రదర్శించటం కిందికే వస్తుంది. తద్వారా ఒకరినొకళ్ళు పూర్తిగా అర్థం చేసుకోవటానికీ వీలు కుదురుతుంది.

## 'నా మిత్రులు నాకే' అనేవాడు

❐ కొందరు పురుషులు తన మిత్రుల్ని భార్యకు గానీ, ప్రియురాలికి గానీ అసలు పరిచయం చేయనే చేయరు.- చేయాల్సిన అవసరం లేదంటారు.

- తన జీవితానికి సంబంధించిన అంత ముఖ్యమైనవాళ్ళను ఆమెకు ఎడంగా ఉంచుతున్నాడంటే, అతనిది కొంత స్వార్థ ప్రేమేననుకోవచ్చు.
- ఆమె పట్ల అతని ప్రేమలో కమిట్‌మెంట్ (అంకితభావం) తక్కువేననీ అనుకోవాలి.

## 'నీ స్నేహితులు నాకూ స్నేహితులే' అనేవాడు

❐ కొందరు మగవాళ్లు తన స్నేహితుల్ని భార్యకు పరిచయం చేయరు గానీ, ఆమె స్నేహితులతో మాత్రం పరిచయం పెంపొందించుకోవాలనుకుంటారు. ఇలాంటి వ్యక్తిని ఆమె కొంచెం కనిపెట్టి ఉండడం మంచిది.

- ఎందుకంటే ఆమె స్నేహితుల్ని కూడా వలలో వేసుకోవాలనే దుర్బుద్ధి ఉంటుందతనకి.
- నిజంగానే అతనిది విశాల ప్రేమ అయితే తన స్నేహితుల్ని కూడా ఆమెకు పరిచయం చేస్తాడు. అలా చేయటం లేదు కాబట్టే అతణ్ణి శంకించాలి.

❐ మరో రకం మగవాళ్ళు ఉంటారు, భార్య అందగత్తె కాకపోవటమో, ఆమె అమాయక అయి ఉండటాన్ని ఎరిగో ఆమెకు తన స్నేహితుల్ని పరిచయం చేస్తూనే అంతకంటే ఆత్రంగా, ఆమె స్నేహితురాళ్ళతో సాన్నిహిత్యం పెంచుకోవాలని చూస్తారు.

- ఇది మరీ పచ్చి స్వార్థమూ, అవకాశవాదమూను. ఇతడి బుద్ధిని తెలుసుకోలేకపోతే భార్య లేక ప్రియురాలు త్వరలోనే అతడి వంచనకు గురికాక తప్పదు.

## మిత్రులే లేనివాడు

❐ కొందరు అసలు స్నేహితులే లేని వాళ్ళుంటారు. ఇలాంటి పురుషుడు ఎమోషనల్‌గా తనమీద పూర్తిగా ఆధారపడ్డట్లు కనిపించటంతో ప్రారంభదశలో గాళ్‌ఫ్రెండ్ అతనిపట్ల బాగా ఆకర్షితురాలవుతుంది. కాని త్వరలోనే ఆమె భ్రమ పటాపంచలవక తప్పదు.

- ఎందుకంటే అతను తనలోని చాలా అనుభూతుల్ని ఆమెకు చెప్పకుండా దాచుకుంటాడు. తన ఉద్వేగపు అవసరాల కోసం అతడామె మీద ఆధారపడినట్లు కనిపిస్తాడే తప్ప తన ఉద్వేగపు గూటిలోంచి బయటికి మాత్రం రాడు ఆమె ఎంత ప్రయత్నించినా కూడా...

ఆఖరుగా ఒక చిన్న మనవి -

- పురుషుల మధ్య స్నేహాలూ, స్త్రీల మధ్య స్నేహాలూ వేరు వేరు కారణాల వల్ల వేరు వేరు ప్రోద్బలాలతో పరిఢవిల్లుతుంటాయి.
- పురుషుల మధ్య స్నేహానికి ఆసక్తులూ, అభిరుచులూ కలవటం ప్రేరకంగా పనిచేస్తుంది. అనుభూతుల్ని పంచుకోవటం తక్కువ ఉంటుంది.

- కాని స్త్రీల మధ్య స్నేహం అలా కాదు, ఆసక్తులు, అభిరుచులు కలవటం కంటే అనుభూతుల్ని పంచుకోవటం ఎక్కువ ఉంటుంది.
- కాబట్టి పైన చెప్పిన విశ్లేషణల్ని ఒకమ్మాయి తన బాయ్‌ఫ్రెండ్ తాలూకు మనస్తత్వాన్ని తెలుసుకోవటానికి ఉపయోగించాలి తప్ప తమ ఇద్దరి మధ్యా సంబంధ బాంధవ్యాల విషయంలో అన్వయించటం సమంజసం కాదు!! అంటే అతను తనకు సూటవ్వుతాడా లేదా అనే విషయంలో అన్వయించ బూనటం మంచిది కాదన్నమాట...

# 12



# ఎలాంటి కుటుంబంలో పెరిగాడు?

(అతను ఎలాంటి కుటుంబ చట్రంలో పెరిగాడో తెలుసుకో
నీ సంసారచక్రం ఏ రకంగా ఉంటుందో తెలుస్తుంది!)

బాల్యం నుంచీ పెరిగిన కుటుంబ వాతావరణం ఒక మనిషి పిచ్చివాడు కావటానికి మూలకంగానూ ఉండవచ్చు లేక అతను జీనియస్ కావటానికి దోహదకరం గానూ ఉండవచ్చు.

ఒక మనిషిలో ప్రేమించే సామర్థ్యాన్నీ ఆనందించే మనస్సునూ ఏర్పరచేది కుటుంబ వాతావరణమే! అతడిలో లోతుగా వేళ్ళూనుకునే అభద్రతా భావానికి మూలహేతువూ కుటుంబ వాతావరణమే!!

అతడు పెంచబడ్డ తీరు అతడిలో గభాల్న కోపం తెచ్చుకునే గుణాన్ని గానీ, తను సాధించిన దానికి గర్వం చెందే గుణాన్ని గానీ ఏర్పరుస్తుంది. మనస్తత్వ శాస్త్రం ప్రకారం మనిషి మీద అతడు పెరిగిన కుటుంబ వాతావరణం బలమైన ముద్రను వేస్తుంది

కాబట్టి ఓ ఒప్పుల కుప్పా!
లేక వయ్యారి భామా!!



నీ బాయ్‌ఫ్రెండ్‌లో ఎలాంటి పురుష లక్షణం ఉందో తెలుసుకోవాలంటే అతడి తండ్రిని కాసేపు గమనించు.

అతడు స్త్రీల పట్ల ఎలా ఫీలవుతాడో తెలుసుకోవాలంటే తన తల్లి గురించి అతనేమనుకుంటున్నాడో అడుగు.

అతను ఎలాంటి తండ్రి అవుతాడో తెలుసుకోవాలంటే తన సోదరీ సోదరులతో అతను ఎలా మెలుగుతున్నాడో గమనించు-

ఇంతటి ప్రాముఖ్యత గల అతడి కుటుంబ జీవితాన్ని స్పృశించటం మంచిది కదూ?!

## కుటుంబ చట్రంలో పెరిగినవాడు

❒ అతనింట్లో కుటుంబ సభ్యులంతా స్నేహితుల్లా బుజం బుజం కలిపి మెలుగుతారు. అందరూ కలిసి ఒకసారే ఒకచోటే భోజనం చేస్తారు. తుళ్ళుతూ పేలుతూ కబుర్లు చెప్పుకుంటారు. ఏదన్నా ఒక సినిమా లేక ఫంక్షనుకు వెళ్లాలంటే అందరూ కలిసి ఒక యూనిట్‌గా వెళ్తారు.

❒ ఇలాంటి వాతావరణంలో పెరిగిన వ్యక్తి సామాజిక ఉద్వేగపరమైన జీవితానికి

కుటుంబం కేంద్రబిందువుగా ఉంటుంది. ఈ కుటుంబంలోని సభ్యులు సెలవు దినాన్ని ఎవరికి వాళ్ళు విడివిడిగా కాకుండా అంతా కలిసి ఒకచోట గడుపుతారు. పిక్నిక్‌లు, పార్టీలు కలిసి ఏర్పాటు చేసుకుంటారు. వాళ్ళలో ఎవరన్నా పనిమీద బయటికి లేక ఊరుదాటి వెళ్తుంటే ఎటు వెళ్తోందీ, మళ్ళీ ఎప్పుడు వచ్చేదీ ముందే ఆరాలు అడిగి తెలుసుకుంటారు...

- ఇలాంటి కుటుంబంలో పెరిగిన వ్యక్తి జీవన సహచరితో ఎలా మెలిగే అవకాశం ఉంది??
- రెండు రకాలుగా -

★ ఒకటి - ఆ కుటుంబం ఆరోగ్యకరమైన సంబంధాల్ని మెయిన్‌టెయిన్ చేసేదయితే సభ్యులంతా బయటినుంచి వచ్చే కొత్త వ్యక్తులకు హృదయపూర్వకంగా ఆహ్వానాన్ని పలుకుతారు. నువ్వు ఆ ఇంటి కోడలుగా వెళ్తే నీకు తమలో ఒకరిగా స్థానం కల్పిస్తారు. అయితే నీకు వాళ్ళలో కలిసిపోయే చొరవా మనస్తత్వమూ ఉండాలన్న సంగతిని మర్చిపోవద్దు!

వింటున్నావా పాపాయీ!

- అలాగే పైన చెప్పిన కుటుంబాలలో మరో రకం వాళ్ళూ ఉంటారు. వీళ్ళు తమ కుటుంబంలోకి బయటివాళ్ళు ప్రవేశించటాన్ని ఇష్టపడరు. బయటివాళ్ళకు తమలో స్థానం లేనట్లుగా ప్రవర్తిస్తారు. ఇది చాలా అనారోగ్యకరమైన వాతావరణం!
- ఇలాంటి వాతావరణంలో పెరిగిన పురుషుడి 'ఇగో' నలిగిపోవటమే కాక అతడిలో ఆత్మవిశ్వాసం కూడా సన్నగిల్లి ఉంటుంది.
- అతడు నిన్ను తన కుటుంబ వాతావరణం లోకి తీసుకుపోయినప్పుడు తన కుటుంబసభ్యులలో పడి ఆ కాసేపూ నిన్ను మర్చిపోయినట్లు ప్రవర్తిస్తే మాత్రం నువ్వు ముందే జాగ్రత్తపడి దూరంగా తొలగటం మంచిది.
- అలాకాక తన కుటుంబసభ్యుల ఆప్యాయతల మధ్య కూడా నిన్ను మర్చిపోకుండా నీకు ప్రాముఖ్యత ఇస్తోంటే నిస్సంకోచంగా అతడి జీవితంలోకి ప్రవేశించవచ్చు.

## కుటుంబానికి దూరంగా పెరిగినవాడు

☐ కొందరు కుర్రవాళ్ళు ఏ కారణం వల్లో చిన్నప్పటి నుంచీ తల్లిదండ్రులకు దూరంగా

పెరుగుతారు. తండ్రి ఉద్యోగరీత్యా కానీ మరే కారణంవల్లనైనా కానీండి. సెలవలకూ, పండగలకూ, పబ్బాలకూ మాత్రం వచ్చి తల్లిదండ్రుల వద్ద గడిపి వెళ్తారు. ఈ ఎడం కొద్ది మైళ్ళ దూరమూ కావచ్చు కొన్ని వందలమైళ్ళ దూరమూ కావచ్చు. ఇలా దూరాన ఉన్నప్పుడు మాత్రం తల్లిదండ్రులతో ఉత్తర ప్రత్యుత్తరాల్ని నడుపుతారు.

ఇలాంటి పురుషుడితో స్త్రీ జీవితం ఎలా ఉంటుంది?

- బాల్యంనుంచీ తల్లిదండ్రులకు దూరంగా పెరిగినవాళ్ళు ఉద్వేగపరంగా ఎడారిలాంటి జీవితాన్ని గడుపుతారు.
- తల్లిదండ్రులకు దగ్గరగా ఉండి అతి ప్రేమకు గురైనవాళ్ళ లాగే తల్లిదండ్రులకు దూరంగా ఉండి ప్రేమరాహిత్యానికి గురైన ఇలాంటివాళ్ళు కూడా పెద్దయాక తమ ప్రేమ వ్యవహారాలలో పాజిటివ్ ధోరణిని ప్రదర్శించలేకపోతారు. ఫలితంగా ప్రేమిస్తున్న అమ్మాయితో అనుబంధాన్నీ ఏర్పరచు కోలేరు.
- ఇలాంటి పురుషులు ప్రియురాలు లేక భార్య తననెక్కడ కంట్రోల్ చేస్తుందో అనే భయంతో ఆమె ఆత్మీయతను దూరంగా నెట్టబోతారు. అయితే లోలోపల మాత్రం ఆమెతో దగ్గరతనాన్ని కోరుకుంటూనే ఉంటారు.
- ఆమె కొద్దిపాటి సహనాన్నీ, సంయమనాన్నీ పాటిస్తే అతడిని కొంగున కట్టేసుకోవటం పెద్ద కష్టమేమీ కాదు.

## కుటుంబం గురించి చెప్పుకోలేని వాడు

❒ కొందరు ఏ కారణం వల్లనో తన కుటుంబం గురించి చెప్పుకోలేరు. అతి పేదరికం వల్ల కావచ్చు లేక కుటుంబానికి సంబంధించి ఏదన్నా చెడు చరిత్ర ఉండటం వల్ల కావచ్చు. ఏ కారణం వల్లనైనా గానీ గాళ్‌ఫ్రెండ్‌ని తన కుటుంబంలోకి తీసుకు పోవటానికి సిగ్గిల్లుతారు. కించబాటు చెందుతారు, న్యూనతను పొందుతారు.

ఇలాంటి పురుషుడి మాట?

- తన కుటుంబ సభ్యుల విషయంలో అవమానాన్నీ, సిగ్గునూ పొందేవాడు, రహస్యంగా తన విషయంలో కూడా అలాంటి భావాల్నే పొదుగుకుంటూ జీవించుతాడు.. ఎందుకంటే అతనూ వాళ్ళలో ఒక భాగం కాబట్టి!
- ఇలాంటి వ్యక్తి తన తల్లిదండ్రులను విమర్శించినట్లుగానే తననూ తను ప్రేమించేవాళ్ళనూ కూడా విమర్శించటానికి ఏ మాత్రం వెనుకాడడు.

- ఇతనికి కొంత మానసిక పరిపక్వత అవసరం. మంచికో, చెడుకో అతను తనలో తల్లిదండ్రుల పట్ల ఉన్న కోపాన్నీ, అసహ్యాన్ని అంగీకరించి వాళ్ళతో రాజీకి రావటానికి ప్రయత్నించాలి. ఆ స్థితికి వచ్చాక గానీ అతడు తను ప్రేమించిన లేక పెళ్ళాడిన అమ్మాయికి న్యాయం చేకూర్చలేడు.
- అందుకు ఆ అమ్మాయి అతనికి అవసరమైన మానసిక స్థైర్యాన్నీ, చేయూతనీ అందివ్వటం ఉత్తమం!

## విమర్శల మధ్య పెరిగినవాడు

❑ కొందరు బాల్యంనుంచీ తల్లిదండ్రుల కోపాలు, చికాకులు, విమర్శల మధ్య పెరుగుతారు. వాళ్ళకు తల్లిదండ్రులంటే భయం, బెరుకూ ఉంటాయి. ప్రేమించిన అమ్మాయిని ఇంటికి తీసుకుపోయి వాళ్ళకు పరిచయం చేయటానికి కూడా వెనకా ముందాడతారు. వాళ్ళు ఏ వంక పెడతారో ఏ విమర్శ చేస్తారోననే భయంతో...

- బాల్యం నుంచీ విమర్శల మధ్య పెరిగిన వ్యక్తికి తన సామర్థ్యం మీద తనకు నమ్మకమూ, ఆత్మగౌరవమూ ఉండవు.
- ఇతను కనక ప్రియురాలిని ధైర్యంగా, గర్వంగా తీసుకుపోయి తల్లిదండ్రులకు పరిచయం చేయగలిగితే, వాళ్ళ కోపతాపాలూ విమర్శలూ అర్థం పర్థం లేనివిగా గ్రహించాడనీ మానసికంగా బాగా ఎదిగాడనీ అనుకోవచ్చు. ముందు ముందు ఆమెను వాళ్ళ విమర్శల నుంచీ తెగడ్తల నుంచీ కాపాడగలడనీ అనుకోవచ్చు.
- నిస్సంకోచంగా ఆమె అతడిని పెళ్ళాడటానికి అంగీకరించవచ్చు.
- అలాకాక ప్రియురాలిని తల్లిదండ్రులకు పరిచయం చేయటానికి వెనుకాడుతుంటే మాత్రం అతను వాళ్ళ ప్రభావం నుంచి ఇంకా బయటపడలేదనీ మానసిక పరిపక్వతను సంతరించుకోలేదనీ అర్థం చేసుకోవాలి.
- అతనికి ఇతరులను అంగీకరించటం, క్షమించటం, ఇతరుల పట్ల సహనం వహించటం ఎలాగో తెలియదనీ అనుకోవచ్చు.
- తల్లిదండ్రులలాగే ఇతనూ తన ప్రియురాలి మీద విమర్శలు గుప్పించటానికి ఏ మాత్రం వెనుకాడడు. అతడికి గుడ్‌బై చెప్పేయటమే ఉత్తమం ఆమెకు.

## సంప్రదాయక కుటుంబీకుడు

సంప్రదాయిక కుటుంబం అంటే -

- స్త్రీ ఇంటికి అంటిపెట్టుకుని ఉండటం, బయటి వ్యవహారాలలో జోక్యం చేసుకోకపోవటం, భార్యగా పురుషుడికి ఎదురు చెప్పకపోవటం, ఎంతో కొంత అతనికి అణగి మణగి ఉండడం ఇత్యాదులు స్త్రీ లక్షణాలుగానూ,
- పురుషుడు సంపాదించడం, బయటి వ్యవహారాలను చక్కబెట్టుకు రావటం, కుటుంబ సభ్యులకు రక్షణ కల్పించటం-

వగైరా వగైరాలు సంప్రదాయక కుటుంబానికి చిహ్నాలు!

- అలాంటి కుటుంబంలో పెరిగిన పురుషుడు తను పెళ్లాడే అమ్మాయి కూడా తన తల్లిలాగే సంప్రదాయకంగా ఉండాలనీ అంటే ఇంటిని అంటిపెట్టుకుని ఉండాలనీ, తనకు అణిగి ఉండాలనీ కోరుకుంటాడు.
- ఒకవేళ భార్య ఉద్యోగం చేస్తుంటే ఇంటికి వచ్చాక ఇంటిపనుల బాధ్యత ఆమెదేననీ తనందులో సహాయ పడాల్సిన పనేమీ లేదనీ అనుకుంటాడు.
- బాయ్‌ఫ్రెండ్ సంప్రదాయక కుటుంబం నుంచి వచ్చాడని తెలిసినప్పుడు ఆ అమ్మాయి మొదటగా తన గురించి తను ఆత్మవిమర్శ చేసుకోవాలి.
- తను ఆధునిక విలువలతో స్వేచ్ఛాయుతంగా (ముఖ్యంగా భార్యాభర్తల పాత్రల విషయంలో) ఉండదల్చుకుందా లేక సంప్రదాయిక గృహిణిగా ఉండగలదా?
- తనలో ఆధునిక విలువలు బలంగా పాతుకుని ఉన్నాయనిపించినప్పుడు అతని జోలికిపోకపోవటం మంచిది.
- అలా కాక సంప్రదాయిక గృహిణిత్వం పట్ల మక్కువ ఉంటే నిస్సంకోచంగా అతడితో పెళ్ళికి అంగీకరించవచ్చు.
- ఏమైనా ఇలాంటి పురుషుడి విషయంలో ఆమె కాస్త సహనం వహించి ఆర్గ్యుమెంట్స్ ద్వారా మెప్పించి ఒప్పించగలిగితూ అతడిని తనకు అనుకూలంగా మలుచుకోవటం ఏమంత కష్టం కాదు కూడా.

## విడిపోయిన తల్లిదండ్రుల వాడు

- కొందరికి ఏ కారణం వల్లో తల్లిదండ్రులు అతని బాల్యంలోనే విడిపోవటమో లేక విడాకులు తీసుకోవటమో జరుగుతుంది. అప్పటినుంచీ అతను తల్లి వద్దో, తండ్రి వద్దో పెరగటం జరుగుతుంది. అలాంటివాళ్ళ ప్రేమ లక్షణాలు ఎలా ఉంటాయి?

❒ విడిపోయిన తల్లి వద్దో, తండ్రి వద్దో పెరిగిన పిల్లలు పెద్దయ్యాక ప్రియురాలి విషయంలో అయా సిట్యుయేషన్స్‌ని బట్టి వివిధరకాలుగా స్పందించే అవకాశం వుంది.

- తల్లి లేక తండ్రి - ఇలా ఒకరి వద్ద మాత్రమే పెరిగే పిల్లలు వేగంగా మానసిక పరిపక్వతను పెంపొందించుకుని జీవితంలో బాధ్యతలను ముందస్తుగానే నెత్తిన వేసుకుంటారని అనేక పరిశీలనలలో వెల్లడైంది.
  - అతను మరీ సీరియస్‌గా నన్నా రూపు దిద్దుకోవచ్చు. లేకపోతే సనాతనుడుగా నన్నా రూపు దాల్చవచ్చు. అది కూడా చాలా చిన్నవయస్సు నుంచే!
  - ఏమైనా అతను బాధ్యతల నుంచి మాత్రం పారిపోడు.
- తండ్రి వద్ద కాక విడిపోయిన తల్లి వద్ద పెరిగిన కుర్రవాడు తన అభిప్రాయాలనూ అనుభూతుల్నీ ఆమెతో స్వేచ్ఛగా వెళ్ళడించి ఆమెతో చర్చలలో పాల్గొంటుంటాడు.
  - పెద్దయాక తనను అర్థం చేసుకోగలిగే స్త్రీకి అతను అతి ఆత్మీయంగా అతుక్కుపోయే అవకాశం ఉంది. ఎమోషనల్‌గా కూడా ఆమెతో చక్కటి అవగాహనకు రాగల్గుతాడు.
- తల్లిదండ్రులు విడిపోవటానికి తల్లే కారణమనే భావన కనుక అతనిలో నాటుకుని ఉంటే అతనికి ఆమెమీద ఎంతో కోపం పేరుకుని ఉంటుంది.
  - ఆ కోపం ఒక్క తల్లి మీదే కాక లోకంలోని స్త్రీలందరిమీదా పాకే ప్రమాదం కూడా ఉంది. తన జీవన సహచరి విషయంలో కూడా -
- తల్లిదండ్రులు విడిపోవటానికి తనే కారణమన్న భావం నాటుకున్న కుర్రవాడయితే అతనికి తనమీద తనకు స్వయం ఔన్నత్య భావం లోపించి ఉంటుంది. తర్వాత జీవితంలో జరిగే ప్రతి దురదృష్టానికీ తననే కారకుడుగా చిత్రించుకోవటం మొదలెడ్తాడు.
  - అతడితో జీవితం పంచుకునే స్త్రీ తన ప్రేమకు అతడు అర్హుడేనన్న విషయాన్ని అతడికి తెలిజేయటానికి నానా తంటాలుపడాల్సి వస్తుంది.

# 13



# కుటుంబ సభ్యులతో బంధాలు

(అమ్మకూచి కాదు కదా అతను?
అయితే నీ కొంగుచాటు కూనే!)

ఒక వ్యక్తి తను ప్రేమించి అమ్మాయితో ముందు ముందు ఎలా మెసులు కుంటాడో తెలుసుకోవాలంటే అతని మీద అతని తల్లిదండ్రుల ప్రభావాలేమిటో చూడాలి. వాళ్ళ విషయంలో అతను ఎలా ప్రతిస్పందిస్తున్నాడో తెలుసుకోవాలి.

అతని తండ్రివీ తల్లివీ విలువలూ, దృక్పథాలూ ఎడమొహం పెడమొహంలా ఉండి తరచుగా వాళ్ళిద్దరూ పరస్పరం ఘర్షణపడుతోంటే అతనిలో అంతర్గతంగా అశాంతి గూడుకట్టుకుని ఉండే అవకాశం ఉంది.

తల్లిదండ్రులలో వైరుధ్యాలు ఉన్నా కూడా బాహ్యానికి వాళ్ళు వాటిని ఒప్పుకుని ఒకరితో ఒకళ్ళు సర్దుకుపోతుంటే అతని ఆత్మవిశ్వాసానికేమీ ఢోకా ఉండదు.

సోదరీ సోదరులతో అతని సంబంధ బాంధవ్యాలు కూడా భవిష్యత్తులో అతను ప్రియురాలితో ఎలా మెలుగుతాడో తెలియజేస్తాయి.

ఇప్పుడు ఆ వివరాల గురించి చూద్దాము -

## తల్లితో అతని స్పందన

రాగాల రాచిలుకా-

❐ అతడిని మొట్టమొదట అడగాల్సిన ప్రశ్న ఏమిటో తెలుసా? "మీ అమ్మ గురించి నువ్వేమనుకుంటున్నావు?"

- ○ అతను తన తల్లిని ఎలాంటి కళ్ళద్దాలలోంచి చూస్తాడో మిగతా స్త్రీలతో పాటు నిన్నూ అలాంటి కళ్ళద్దాలలోంచే చూస్తాడు. తన తల్లిని ఎలా ట్రీట్ చేస్తున్నాడో నిన్నూ అలాగే ట్రీట్ చేసే అవకాశం ఉంది.
- ○ అతను తన తల్లి గురించి నెగటివ్ ధోరణిలో ఉండి, ఆమె గురించి మాట్లాడుతున్నప్పుడు అతనిలో కోపచ్ఛాయలు కనిపిస్తే అతనితో కొంచెం జాగ్రత్తగా ఉండు. పక్కకు వైదొలగటానికి సిద్ధంగా ఉండు!
- ○ తల్లికి సంబంధించి అతని అనుభూతులు అసౌకర్యవంతంగానూ దుఃఖభాజనం గానూ ఉంటే మరో స్త్రీతో అతను పరిపక్వపూరితమైన బాంధవ్యాన్ని నెరపలేడు.
- ○ తల్లిని అసహ్యించుకునే పురుషుడు తనకు తెలియకుండానే అన్‌కాన్షస్‌గా స్త్రీలనందరినీ ద్వేషిస్తాడు.
- ○ అతడు నిన్ను ప్రేమిస్తున్నా కూడా గతంలో తల్లి ద్వారా స్త్రీల మీద పొందిన కోపాన్ని ఎప్పుడో ఒకసారి నీమీద వెళ్ళగక్కి ఎమోషనల్‌గా నిన్ను గాయపరిచే అవకాశాలున్నాయి.
- ○ తల్లి పట్ల పాజిటివ్ భావాలు ఉన్నవాడు భార్యలోని సుగుణాల్ని, మంచి లక్షణాల్ని మెచ్చుకుంటూ ఆమెను అనురాగ స్రవంతిలో ముంచెత్తుతాడు.
- ○ అయితే ఇక్కడొక ప్రమాదం కూడా లేకపోలేదు, తల్లితో అతడి బంధం మరీ బలీయంగా ఉంటే అతడు తన జీవితంలోకి మరో స్త్రీని ఆహ్వానించటానికి సిద్ధంగా ఉండడు.

కాబట్టి అమ్మాయీ!

❐ నీ బాయ్‌ఫ్రెండ్ తన తల్లి గురించి ఏమి చెబుతాడో వినటమే కాకుండా అతడు తన తల్లితో ఎలా ప్రవర్తిస్తాడో కూడా గమనించాలి. ఎవరో అన్నట్లుగా తల్లితో బుద్ధిగా ఉండేవాడు భార్యతో కూడా బుద్ధిగానే ఉంటాడు. అందుకని ఈ కింది ప్రశ్నలకు సమాధానాల్ని వెతకటానికి ప్రయత్నించు.



❖ ఎమోషనల్‌గా అతను తన తల్లికి అండను అందిస్తుంటాడా?

○ ఇలాంటి పురుషుడు తన జీవన సహచరి విషయంలో కూడా ప్రేమను, ఆర్తినీ అందించి ఆమెను ఆదుకుంటాడు. అందుకు ప్రతిగా ఆమె తనకు కృతజ్ఞురాలిగా ఉండాలని కోరుకోడు కూడా.

❖ తన జయాపజయాలకు సంబంధించిన వార్తలను అతను తల్లితో పంచుకుంటాడా?

○ తను చెప్పిన విషయాల్ని తల్లి విశ్వసిస్తుందనీ, ఆమోదిస్తుందనీ, తనకు అండగా నిలుస్తుందనీ నమ్మకం ఉండబట్టే అతను తన జీవితానికి

*సంబంధించిన ముఖ్య వార్తల్ని ఆమెతో కలిసి పంచుకుంటాడు.*

- ○ *తను అంగీకరించబడతాననే ఇలాంటి పాజిటివ్ ధోరణి కల పురుషుడు మిగతా స్త్రీల వద్ద కూడా తనను ఎలా అర్పించుకోవాలో తెలిసినవాడై ఉంటాడు. స్వతహా వస్తుందది అతనికి!*

✣ *అతడు నిన్ను తన తల్లికి పరిచయం చేస్తున్నప్పుడు గర్వాన్ని ఫీలయినట్లు కనిపించాడా?*

- ○ *తన తల్లితో పాటు నీకు కూడా గౌరవం ఇస్తున్నాడనేందుకు సూచన ఇది!*

✣ *ఇంట్లో అతను ఎక్కువగా తల్లితో కబుర్లు చెబుతూ కాలం గడుపుతాడా?*

- ○ *తల్లి సహచర్యాన్ని ఆనందించే పురుషుడు సహజంగా మిగతా స్త్రీలతో సహచర్యానికి కూడా విలువనూ గౌరవాన్ని ఇస్తాడు.*

✣ *తల్లి తనను ఎలా పెంచిందో వివరిస్తున్నప్పుడు ఆ పెంపకంలో లోటుపాట్ల గురించి కూడా ప్రస్తావిస్తాడా?*

- ○ *లోకంలో పర్ఫెక్ట్ భార్య అంటూ ఎలా ఉండదో అలాగే ఫర్ఫెక్ట్ తల్లి అంటూ కూడా ఎవరూ ఉండరు. తల్లిలో లోటుపాట్లను అంగీకరించే మనిషి భార్యలో లోటుపాట్లను కూడా అంగీకరించగలుగుతాడు.*
- ○ *అలాంటి వ్యక్తి భార్యతో ఏవైనా పొరపొచ్చాలు వచ్చినా సమస్య గురించి ఆమెతో సామరస్యపూర్వకంగా చర్చించి ఒక పరిష్కారానికి రాగలుగుతాడు.*

## తండ్రి పట్ల స్పందన

❐ బాయ్‌ఫ్రెండ్‌ని నువ్వు అడగాల్సిన రెండో ప్రశ్న -

"మీ నాన్న మీ అమ్మను ఎలా చూస్తాడు?"

★ అతని తండ్రి తన భార్యను అంటే నీ బాయ్‌ఫ్రెండ్ తల్లిని ప్రేమగా గౌరవంగా చూస్తాడా లేక విమర్శనాత్మకంగా అవమానకరంగా చూస్తాడా?

★ వాళ్ళ మధ్య కుటుంబ బాధ్యతలు ఎలా విభజించబడి ఉన్నాయి?

★ అతని తల్లి పట్ల అతని తండ్రికి ఎలాంటి అభిప్రాయం ఉంది?

★ ఇన్నేళ్ళనుంచీ వాళ్ళ మధ్య సంబంధాలు మార్పు లేకుండా కొనసాగుతున్నాయా?

- ○ **అతని తండ్రి అతని తల్లితో ఎలా ప్రవర్తిస్తున్నాడో, ఎలాంటి దృక్పథాన్ని కలిగి ఉన్నాడో అతను కూడా తన జీవన సహచరితో అలాగే వ్యవహరించే అవకాశాలు ఎక్కువ ఉంటాయి.**

- తండ్రి మీద అతనికి విమర్శనాభావం లేకుండా ఉంటే మాట ఇది!

ఇప్పుడు తల్లిదండ్రులకు సంబంధించిన వివిధ వ్యక్తిత్వాలు ప్రియురాలి విషయంలో అతడి ప్రవర్తన మీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో చూద్దాము.

## ముభావపు వాడు

❒ తల్లిదండ్రులిద్దరూ ఎమోషన్స్‌ని ప్రదర్శించకుండా హమేషా సీరియస్‌గా, ఉదాసీనంగా ఉండే వాళ్ళయితే అలాంటి వాతారవణంలో పెరిగిన కుర్రవాడు మనుషుల్తో తానూ అలాగే ఉండాలి గావుననుకుని ఇతరులతో పెద్ద స్పందన లేకుండా ముభావంగా సీరియస్‌గా ఉండే అలవాటుకు లోనవుతాడు.

ఆఖరికి భార్య విషయంలో కూడా...

- మనుష్యులకు ఎడంగా మెలుగుతాడతను. ఎంతసేపూ తను అభిమానం పెంచుకున్న వస్తువుల మీదా, తను సాధించదల్చుకున్న లక్ష్యాలమీదా మాత్రమే దృష్టిని నిలుపుతాడు.

## తండ్రిలేని అమ్మకూచి

❒ ఇంట్లో తండ్రి లేకుండా పెరిగిన కుర్రవాడికి తను ఎలాంటి పురుషుడుగా రూపుదిద్దుకోవాలో తెలియదు. బాల్యంలో అతనికి ఆదర్శపాత్రుడంటూ ఎవరూ ఉండరు కాబట్టి తను ఎలాంటి వ్యక్తిత్వాన్ని ఏర్పరచుకోవాలో తెలియక గందరగోళంలో పడిపోతాడు.

- ఫలితంగా అతనిలో ఆత్మవిశ్వాసం లోపించి స్వంత నిర్ణయాలు తీసుకోలేకపోయే లక్షణం అబ్బుతుంది.
- చిన్నప్పటి నుంచీ అతను తన బాధ్యతల్ని తల్లి చేతుల్లో ఉంచటం అలవాటు చేసుకుంటాడు. అట్లాగే పెద్దయాక కూడా తన బాధ్యతను భార్య చేతుల్లో ఉంచేసి చేతులు దులుపుకుంటాడు.

## ఏడుపుగొట్టు తల్లి కలవాడు

❒ ఏ కారణం వల్లనైతేనేమి ఒక స్త్రీ జీవితం దిగులుగా విషాదంగా గడుస్తుంది. అలాంటి తల్లి పెంపకంలో పెరిగిన కుర్రవాడికి జీవితంలో ప్రేమ కనిపించదు. సుఖసంతోషాలు ఉండవు.

- అలాంటి వ్యక్తి తన అవసరాల్ని గుర్తెరగలేడు. తల్లి నిరాశనే తనూ వంట పట్టించుకుని దానిని రాబోయే భార్య మీద రుద్దుతాడు.

## స్వీట్‌హోమ్ సీతాపతి

❒ తల్లిదండ్రులు ఒకరినొకళ్ళు అర్థం చేసుకుని ఒకరిపట్ల ఒకరు సక్రమమైన ఆరోగ్యకరమైన ప్రేమను ప్రదర్శిస్తున్నప్పుడు....

- ○ అలాంటి తల్లిదండ్రుల పెంపకంలో పెరిగిన కుర్రవాడు మంచి ఆత్మవిశ్వాసంతో ఉండి ఇతరుల్ని ఆనందపరిచే నేర్పరితనాన్ని సంతరించుకుంటాడు.
- ○ భార్య విషయంలో కూడా ఇతను నమ్మకంగానూ సానుకూల ధోరణిలోనూ ప్రవర్తించి మానసికంగా ఆమె ఏ వొత్తిడులకూ గురి కాకుండా చూస్తాడు.

## అతి గారాబువాడు

❒ కొందరు తల్లిదండ్రులు తమ పిల్లల్ని అతి ప్రేమతోనూ గారాబంగానూ పెంచుతారు. అలాంటి వాతావరనంలో పెరగిన కుర్రవాడికి దీర్ఘకాలం మీద నష్టమే జరుగుతుంది గానీ లాభమేమీ వొరగదు.

- ○ ఇలాంటి తల్లిదండ్రులు తమ పిల్లల్ని మానసికంగా ఎదగకుండా చేస్తారు. అలా పెరిగిన కుర్రవాడిలో ఉద్వేగపరమైన అభివృద్ధి (ఎమోషనల్ డెవలప్‌మెంట్) జరగకుండా మధ్యలోనే ఎక్కడో ఆగిపోతుంది. ఫలితంగా అతను భార్య వద్ద కూడా అపరిపక్వంగానే ప్రవర్తిస్తాడు.

## గయ్యాళి తల్లి, మెతకతండ్రీ కలవాడు

❒ తల్లి గయ్యాళి, తండ్రి మెతక మనిషీ కల కుర్రవాడు అదినుంచీ తల్లి అజమాయిషీలో తండ్రిలాగే లొంగి బతుకుతాడు. ఫలితంగా పెద్దయేసరికి అతనిలో స్వయం ఔన్నత్య భావం, ఆత్మవిశ్వాసం లోపిస్తాయి.

- ○ తల్లి వద్ద తండ్రి చవటలా బతకడం అతడి మీద గాఢముద్ర వేసి మనస్సులో అతనికి ఆడవాళ్ళ పట్ల కోపాన్నీ నిరాశనూ పెంచుతాయి. భార్య వద్ద కూడా అతను తండ్రిలాగే అణకువగానూ, అసమర్థుడుగానూ బతకడం ఖాయం!

## సోదరీ సోదరులతో అతని బంధాలు

అతడు తన సోదరీ సోదరులతో ఎలా మెలుగుతాడు?

ఆ ప్రభావం భార్యతో అతడి అనుబంధం మీద కూడా ప్రతిఫలిస్తుంది!

✣ *ఒక యువకుడికి చాలా చిన్నతనంలో తండ్రి చనిపోతాడు. (అతనికి పది హేనేళ్ళు*

# 14



# ఉద్వేగాలు - వ్యక్తిత్వం

( అతడి ఉద్వేగాలు భద్రమైనవేనా? అయితే మీ ప్రేమ పదిలమే! )

ఇప్పుడు మనిషిలో ఉండే కొన్ని సాధారణ ఉద్వేగాలనూ, అవి ఎలాంటి వ్యక్తిత్వాలకు కారణభూత మౌతుంటాయో మొదలైన వాటి గురించి చూద్దాము.

**భద్రతాభావం - అభద్రతాభావం**

❏ ఒక మనిషికి తన కాళ్ళకింద భూమి కదిలిపోతుందేమోనంటూ ఉండే భయ సందేహాలు అతడిలోని భద్రతారాహిత్యభావానికి సూచనగా చెప్పుకోవచ్చు. ఉదాహరణకు ప్రియురాలు లేక భార్య ప్రేమించటం లేదేమోననే శంక, ఉద్యోగం ఉంటుందో ఊడుతుందోననే భయం, ఇత్యాదులు ఈ కోవలోకి వస్తాయి.

❏ ఈ శంకలూ, భయాలూ కూడా ఏవో బలమైన కారణం ఉండి కాక నిర్హేతుకంగా కలగటం దీని ప్రత్యేకత. మనస్తత్వ శాస్త్రంలో ఈ భద్రతారాహిత్య భావాలను మనిషి జీవితాన్ని పాలించే ఒక ముఖ్యమైన అంశంగా చెబుతుంటారు.

❏ ఈ లోపంతో బాధపడే మనిషి తాను జీవితాన్ని సమర్థవంతంగా ఎదుర్కొనగలనో లేదోనన్న భయసందేహాలతో అనునిత్యం బెంబేలెత్తిపోతుంటాడు. నిజం చెప్పాలంటే ప్రతి వ్యక్తీ జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక కారణం వల్ల ఈ భావానికి లోను కావటం సహజం.

వచ్చేలోపే ననుకుందాము) అప్పటినుంచీ అతను కుటుంబ బాధ్యతలను నెత్తిన వేసుకొని బాధ్యతాయుతంగా కుటుంబాన్ని నడుపుతున్నాడు.

- ఇలా బాల్యంలోనే కుటుంబ బాధ్యతల్ని స్వీకరించిన వ్యక్తి భార్యతో లేక ప్రియురాలితో సంబంధం విషయంలో కూడా చాలా బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తాడు. అయితే ఇతనికి జీవితం పట్ల సీరియస్‌నెస్ ఎక్కువ. రొమాన్సు కోసం బాధ్యతల్ని కాసేపు పక్కన పెట్టటానికి ఇష్టపడడు. అతడితో జీవితంలో భార్యకు మధురక్షణాలు తక్కువగా ఉంటాయి.

✣ ఒక వ్యక్తి తన సోదరుడితో దాదాపు పది పదిహేనేళ్ళ నుంచీ మాట్లాడటం లేదు.

- ఇలాంటి వ్యక్తిలో క్షమాగుణం తక్కువ, కోపం ఎక్కువా ఉంటాయి. భార్యతో సంబంధాలలో ఆ కోపగుణాలు ఎప్పుడో బయటికి పొంగుకువచ్చే ప్రమాదం ఉంది.

✣ ఒకవ్యక్తి తన సోదరుడితో మిత్రుడిలా ప్రవర్తిస్తాడు. వాళ్ళిద్దరూ విడివిడిగా దూరంగా ఉన్నా తరచుగా కలుసుకుంటూ ఆనందాన్ని పంచుకుంటారు.

- ఇలాంటి పురుషుడికి సోదరుడితోనే కాదు భార్యతో కూడా అనుబంధాన్ని పెంచుకోవటం ఎలాగో తెలుసు. అతడితో ఆమె జీవితం సవ్యంగా సాఫీగా జరిగిపోతుంది.

✣ ఒకతను తన సోదరులకు దూరంగా ఉంటున్నాడు. ఎప్పుడో గానీ అతను వాళ్ళను కలుసుకోడు, కలుసుకున్నప్పుడు కూడా ఏ సహాయాన్ని అర్థించటానికో అయి వుంటుంది.

- ఇతను పచ్చి అవకాశవాది! అవసరం కోసం తప్ప కుటుంబీకుల్ని కలుసుకోవటం లేదంటే అతనికి మనుషుల మధ్య సంబంధాల విలువలు తెలియవనుకోవాలి.

- ఒకరి నుంచి ఆశిస్తాడు గానీ తను ఇచ్చేదంటూ ఏమీ ఉండదు. భార్యతో ప్రేమ విషయంలో కూడా అంతే. స్వార్థపూరితంగా ఉండవచ్చు.



- అయితే కొద్దిపాటి ఓదార్పు, వెన్ను తట్టటం లభిస్తే సాధారణ మనో ఆరోగ్య వంతులు దీనినీ అధిగమించగలరు. కొన్ని మానసిక లోపాలు కలవాళ్ళు మాత్రం ఎంత ఓదార్పు, ప్రోత్సాహం లభించినా కూడా ఈ భావం నుంచి బయట పడలేరు.
- భద్రతారాహిత్య భావాన్ని పురుషులు వివిధ రూపాలలో ప్రదర్శిస్తుంటారు.
  - ★ తను కావాలనుకున్న వాళ్ళను అతిగా ప్రేమించడం,
  - ★ హమేషా ప్రియురాలి చుట్టూ పరిభ్రమిస్తూ ఆమె పట్ల అతి అటెన్షన్‌ని ప్రదర్శిస్తూ ఆమె నుంచీ అంతే అటెన్షన్‌నీ కోరుకోవటం,
  - ★ ఎదుటివాళ్ళను అతిగా విమర్శించటం లేక అతి సీరియస్‌గా ఉండటం,
  - ★ కుక్కపిల్లగా ప్రియురాలి వద్ద ఒదిగి ఉండటం,
  - ★ లేకపోతే వాళ్ళమీదా వీళ్ళమీదా చాడీలు చెప్పటం

  మొదలైన రూపాలలో....
- బాల్యంలో సరయిన ప్రేమతో కూడుకున్న పెంపకం లేకపోవటం మూలంగా మనిషిలో ఈ లక్షణం చోటు చేసుకుంటుంది.
  - ○ చిన్నప్పుడు తను చేసిన పనులకు ఎవరి నుంచీ, ముఖ్యంగా తల్లిదండ్రుల నుంచి ఆదరణ, మెప్పు లేకపోవటంతో తను పనికిమాలినవాడనీ, తనెవరికీ

అవసరం లేదనీ లాంటి భావాలు మనస్సులో నాటుకుని, కాలక్రమేణా అవి అతడికి తెలియకుండానే మనస్సు అంతరాల్లో ఇంకిపోయి భద్రతా రాహిత్య భావం కింద రూపుదిద్దుకుంటాయి.

- అభద్రతాభావం కల పురుషుడు ఎమోషనల్‌గా ఒకరి మీద ఆధారపడటానికి ప్రయత్నిస్తే భద్రతాభావం కల పురుషుడు ఎమోషనల్‌గా తనుకు తాను స్వతంత్రంగా ఆత్మవిశ్వాసంతో మనగలుగుతాడు.
- భద్రతాభావం కల పురుషుడి నీడలో స్త్రీ జీవితం మానసికంగా ఏ ఒడిదుడుకులూ లేకుండా సాఫీగా గడిచిపోతుంది.
- అతడిలో ఆత్మవిశ్వాసానికి కొదవ ఉండదు కాబట్టి ఆమె కాలాన్ని ధ్యాసనూ తనవేపు మళ్ళించి ఉంచమని ఆమెను డిమాండ్ చేయడు.
- అలాగే అతనికి ఎమోషనల్ అవసరాలంటూ అంతగా ఉండవు కాబట్టి అతని ప్రేమ కూడా అంత బలీయంగా ఉండదన్న సంగతినీ ఒప్పుకోక తప్పదు!
- కాని అభద్రతాభావంతో బాధపడే పురుషుడి విషయం అట్లా కాదు.
- అతడు ప్రియురాలిని తనకు మాత్రమే అంటిపెట్టుకు ఉండమని డిమాండ్స్‌తో సతాయించినా తన ఉద్వేగపరమైన అవసరాల మూలంగా ఆమెను అక్కున చేర్చుకోవటానికీ ఆమె అక్కున చేరి ఉండటానికీ తహతహపడతాడు. ఇదొక ప్లస్ పాయింటే!
- స్వతంత్రతా లక్షణాలు బహుధా కల స్త్రీకి భద్రతాభావం కల పురుషుడు సరిజోడీ అయితే తను కూడా భద్రతా రాహిత్యంతో బాధపడే స్త్రీకి రెండో రకం పురుషుడు బాగా నప్పుతాడు. అయితే ఒకటి -
- భద్రతారాహిత్యంతో బాధపడే పురుషుడితో జీవితాన్ని పంచుకోదల్చుకున్న స్త్రీ అతడి మనస్సులో చెదరిన ఈకల్ని సరిదువ్వటానికి ముందే సిద్ధపడి ఉండాలి.
- అంతేకాక అతడికి తనమీద నమ్మకం కలిగించటానికి బహు ప్రయత్నాలు చేయగలగాలి.
- ఒకసారి అతనిలో ఆ నమ్మకం కలిగించితే మాత్రం అతను ఆమెకు అతి ఆత్మీయంగానూ నిజాయితీతోనూ అంటుకుపోతాడు!

## అదుపు చేసేవాడు

- ఇతరుల్ని తన కంట్రోల్‌లో ఉంచుకోవాలనే గుణం అలవాటు ద్వారా వస్తుంది. ఈ అవలక్షణం ఉన్న వ్యక్తులు తమమీద ఎవరు పెత్తనం చెలాయించబోయినా సహించరు. తను ప్రేమించినవాళ్ళకు ఏదీ ముఖ్యమో ఏది మంచిదో తనకు తెలుసుననే తలబిరుసు అభిప్రాయం ఇలాంటి వ్యక్తులలో బాగా ఉంటుంది.
  - ఇలాంటి పురుషుడు ఒక అమ్మాయిని ప్రేమించాడనుకోండి లేక పెళ్ళాడాడను కోండి, అతను ఆమెకు సంబంధించిన అవసరాలన్నీ తనే నిర్ణయించి తీరుస్తుంటాడు.
  - ఆమె ఏదన్నా మాట్లాడబోయినా నీకు తెలియదు ఊరుకొమ్మంటాడు. ఒక సినిమాకు వెళ్ళాలన్నా ఒక ఫంక్షను చేయాలన్నా, ఆఖరికి ఆమె ఎలాంటి దుస్తులు ధరించాలో, కొనుక్కోవాలో కూడా అతని నిర్ణయం ప్రకారమే జరగాలంటాడు.
  - ఒక్క మాటలో చెప్పాలంటే ఆమె అతని పంజరంలోని చిలకలా ఉంటుంది. అలా అని అతనికి ఆమె మీద ప్రేమ లేదా అంటే తప్పకుండా ఉంటుంది. కాకపోతే ఆమె జీవితాన్నీ, అవసరాల్నీ అతను కంట్రోల్ చేస్తుంటాడు, శాసిస్తుంటాడు!!
  - బాల్యంలో తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోని స్త్రీకి ఇలాంటి పురుషుడు వర ప్రసాదంలా ఉంటాడు. తను బాల్యజీవితంలో కోల్పోయిన ప్రేమను ఆమె అతని నీడలో పొందుతూ సేదతీరగలుగుతుంది. అంతే కాదు, అద్భుతమైన భద్రతాభావం ఆమెకు రక్షగా నిలుస్తుంది.
  - అయితే, స్వతంత్రతా లక్షణాలు గల స్త్రీకి ఇతనితో జీవితాన్ని పంచుకోవటం పిచ్చెత్తించినట్లుగా ఉంటుంది.

    ఒకటి - ఆమె అతనితో జీవితాన్ని సర్దుకుపోవటానికి ప్రయత్నమన్నా చేయాలి లేక

    రెండు - తెలివిగా అతనికి తన సరిహద్దుల్ని తెలియజెప్పటమన్నా చేయాలి.
  - ఏమైనా ఈ రెండో ప్రయత్నంలో ఆమెకు ఎంతో కొంత ఘర్షణ తప్పనిసరి అవటం ఖాయం! అతను లొంగాడూ అంటే మాత్రం ఆమెమీద అతనికి అపారమైన ప్రేమ ఉందనే అనుకోవాలి!

## కోపధారి

- కొందరు పురుషులు అలవాటు పూర్వకంగా వాళ్లతో వీళ్లతో వాదనలు వేసుకుంటూ పోట్లాటలకు దిగుతారు. రిక్షావాడు, హోటల్లో వెయిటరు దగ్గర నుంచి మిత్రులు, భార్య లేక ప్రియురాలు దాకా అందరితోనూ ఏదో ఒక సందర్భంలో సడన్‌గా కోపానికి వచ్చేసి కొట్టినంతగా అరుస్తారు, కేకలు వేస్తారు.

- ఒక సమయాన అది అతడి ధైర్యానికి గుర్తుగా కనిపించినా ఆ మరుక్షణమే అది అతని బలహీనతగా అర్థమైపోతుంది.

- సంవత్సరాల తరబడీ, ముఖ్యంగా బాల్యంలో అతని మనస్సులో పేరుకుపోయిన నిరాశా నిస్పృహలు, కసి, అతడినా ప్రవర్తనకు పురిగొల్పుతుంటాయి.

  - ఇతనితో సహచర్యం రెండు రకాల స్త్రీలకు సాధ్యమౌతుంది.

  1. బలీయమైన వ్యక్తిత్వం ఉండి సహనం, సౌశీల్యం కల స్త్రీకి
  2. తను కూడా ఇలాంటి నిరాశా నిస్పృహలలో కొట్టుమిట్టాడుతూ పోట్లాటకు అవకాశం ఎప్పుడు దొరుకుతుందా అని ఎదురు చూసే గయ్యాళి స్త్రీ కీ....

## నీటుగాడు

- కొందరు అంతా ఒక పద్ధతిగా నీటుగా జరగాలంటారు. ఇంట్లో ఎక్కడి వస్తువులు అక్కడ ఉండాలి. సరిగ్గా ఫలానా వేళకు ఫలానా పని జరిగిపోవాలి. వీటిలో దేనికి ఏం కొంచెం భిన్నం జరిగినా చేతులు కట్టేసినట్లుగా వాళ్ళు గిలగిలలాడిపోతారు.

- ఒక పద్ధతిగా ఖర్చుపెట్టడం, నలుగురితో సంబంధ బాంధవ్యాలను ఓ పద్ధతిగా నిర్వహించటం లాంటి డిసిప్లిన్‌కి సంబంధించిన ఇలాంటి అంశాలు సమాజంలోనూ జీవితంలోనూ పైకిపోవటానికి బాగా పనికి వస్తాయి.

  - ఇలాంటి పురుషుడు తన జీవితాన్ని పంచుకునే స్త్రీతో కూడా ఒక నిలకడనూ నిజాయితీనీ పాటిస్తాడు. ఇతనితో జీవితం సెక్యూరిటీని అందిస్తుంది కాబట్టి కొంత ఇరుకుదనాన్ని ఫీలయినా చాలామంది స్త్రీలు నిశ్చింతగా జీవితాన్ని గడపగల్గుతారు.

  - అయితే ఒకరకమైన స్వేచ్ఛకూ చపలత్వానికీ అలవాటు పడ్డ స్త్రీలకు మాత్రం ఇతనితో జీవితం ఇబ్బందికరంగానే కనిపిస్తుంది మరి!

## ఉద్వేగ రహితుడు

❒ కొందరు మనుష్యులు ఏ కోపతాపాలూ లేకుండా నిదానంగా, ప్రశాంతంగా ఉంటారు. వాళ్ళను ఒక మాట అన్నా పట్టించుకోరు, మరొకళ్ళను ఒక మాట అనటానికీ ప్రయత్నించరు. మనిషిలో మూడ్ అనేదే కనిపించదు. ఉద్వేగం లేని వాళ్ళలా కనిపిస్తారు.

- ఉద్వేగాల్ని అణుచుకుని సాఫీగా తాపీగా ఉండే స్త్రీకి ఇతనితో జీవితం నల్లేరు మీద నడకలా సాగిపోతుంది.
- అయితే హమేషా తుళ్ళిపడుతూ పరవళ్లు తొక్కుతూ సెలయేరులా ఉండే స్త్రీకి మాత్రం ఇతను జడంగా నిరుత్సాహంగా కనిపిస్తాడు. మానసికంగా అతనొక ఒంటరిగాడులా కనిపించి తాను ఎంత ప్రయత్నించినా అతని అంతరంగానికి చేరువ కాలేకపోతున్నానే అసంతృప్తి ఆమెను వేధించే అవకాశం ఉంది.
- ఇలాంటి స్త్రీకి అతని మూలంగా వొరిగే అపకారమంటూ ఏమీ ఉండదు గాని అతనితో జీవితం ఆమెకు నిస్సారంగా మాత్రం అనిపిస్తుంది. అందుకని ముందే ఆమె అతనికి ఎడంగా ఉండటం మంచిది.

# 15



# నానా గుణాభిరాముడు

(సరదా రాయుడితో సంసారం సరస రసజ్ఞ మనోహరం!)

యువతీయువకులు ప్రేమలో పడటానికి రకరకాల ప్రేరకాలు పనిచేస్తుంటాయి. ఎవరి మనస్తత్వాల్ని బట్టి వాళ్ళమీద ఒకో రకమైన ప్రేరకం పనిచేస్తుంటుంది.

స్త్రీల విషయాన్ని తీసుకున్నప్పుడు ఒకామె కేవలం పురుషుడిలో అందచందాలు, దేహ దారుఢ్యాన్ని చూసి ముచ్చటపడవచ్చు.

మరొకామె అతని జీవన లక్ష్యాలు, నైతిక విలువల్ని చూసి ప్రేమలో పడవచ్చు, ఈ విధంగా...

ప్రతి పురుషుడిలోనూ ఎమోషనల్ ప్రొఫైల్ అంటూ ఒకటుంటుంది.

ఎవరి వ్యక్తిత్వమైనా అతడి ఉద్వేగపు ప్రొఫైల్‌కి ప్రతిబింబంగా ఉండటంలో ఆశ్చర్యం లేదు. ఈ ఉద్వేగపు ప్రొఫైల్ అతడితో జీవితాన్ని పంచుకునే స్త్రీ మనస్సుమీదా జీవితం మీదా ప్రభావాన్ని చూపుతుండటమూ సహజం.

అందువల్ల ప్రేమలో పడబోయే ప్రతి అమ్మాయీ, ప్రతి యువతీ మొదటగా తన బాయ్‌ఫ్రెండ్ తాలూకు ఉద్వేగాలు, మూడ్స్ ఎలా ఉంటాయో పరిశీలించాలి. వాటిని విశ్లేషించడం ద్వారా రేపు అతడితో తన జీవితం ఎలా ఉంటుందో అవగాహన చేసుకోవచ్చు.



ఉద్వేగపరంగా అతను ఏ మాత్రం నిలకడగా ఉంటాడు?

మానసిక టెన్షన్, ఆందోళన లాంటి వాటిని అతను ఎలా రిలీజ్ చేసుకుంటాడు?

మొదలైన వాటిని ముందే తెలుసుకోవటం అవసరం.

అయితే మరో విషయం కూడా ఉంది-

అబ్బాయి గానీ, అమ్మాయి గానీ పెళ్ళాడబోయే ముందు అవతలి వ్యక్తి గురించి తెలుసుకోవటం ఎంత అవసరమో తన గురించి కూడా విశ్లేషణ జరుపుకుని ఒక అవగాహనకు రావటం అంతే అవసరం!

ఉదాహరణకు భార్యాభర్తలిద్దరూ మూడీ మనుష్యులు అయితే ఆ కొంపలో జీవిత పర్యంతమూ రావణకాష్టం రగిలే అవకాశం ఉంది.

ఒకరి ఉద్వేగాల గురించి ఒకళ్లు ముందే తెలుసుకుంటే ఇలాంటి ఇబ్బందులు ఎదురవ్వకుండా ముందే జాగ్రత్త పడవచ్చు-

ఇప్పుడు పురుషుడికి సంబంధించిన వివిధ గుణాల్ని బట్టి అవి అతడి జీవన సహచరి మీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో చూద్దాము.

## లోపాల్ని అంగీకరించేవాడు

- ఇతరులు అతడిలోని లోపాన్ని వేలెత్తి చూపితే ఆ విమర్శను సహృదయంతో స్వీకరిస్తాడా లేక 'నీకెందుకు పో' అంటాడా?
- ఒక వ్యక్తి తనలోని లోపాన్ని అంగీకరించటమంటే తనలోని మంచినీ చెడునీ ఒప్పుకుంటున్నట్లే లెక్క!
- విమర్శను సహృయంతో స్వీకరించే ఇలాంటివాళ్ళు ఎదుటి వాళ్ళలోని మంచిచెడుల పట్ల కూడా అంతే సహనాన్ని, సంయమనాన్నీ పాటిస్తారు. ఇది అతడితో జీవితాన్ని పంచుకునే స్త్రీకి చాలా సౌకర్యవంతంగా ఉంటుంది.
- అయితే ఇక్కడ ఒక తిరకాసు లేకపోలేదు-
- తనను తను విమర్శనాత్మకంగా వీక్షించు కునేవాడు ఎదుటివాళ్ళ పట్ల కూడా అంతే విమర్శనాత్మక దృక్పథాన్ని పాటించే ప్రమాదం ఉంది. అప్పుడు అతని జీవన సహచరికి జీవితం పల్లేరుకాయల మీద నడకలా ఇబ్బందిగా ఉండవచ్చు.

## తెలివిని ప్రదర్శించబోయేవాడు

- తన తెలివిని ప్రదర్శించటం కోసం వాదనల్ని మొదలెడతాడా?
- ఊరకే ఊకదంపుడు వాదనలు వేసుకునేవాళ్లు ఆ వాదనల ద్వారా, అందులో నెగ్గటం ద్వారా థ్రిల్‌ని ఫీలవజూస్తారు. ఒకో సమయాన వాళ్ళ ప్రవర్తన అగ్రెసివ్ గానూ రాక్షసంగానూ కూడా ఉండే అవకాశం ఉంది. ఎంతసేపూ అవతలివాళ్ళ మీద తన మేధో ఆధిక్యతను ప్రదర్శించుకోవటం మీదే ఉంటుంది వాళ్ళ తాపత్రయం!
- ఇలాంటివాళ్లతో నెగ్గుకు రావటానికి రెండే రెండు మార్గాలున్నాయి.
  - ★ ఒకటి - వాదనలో అతడిమీద నెగ్గి అతడి తలను వంచటం,
  - ★ రెండోది - నోరు మూసుకుని 'సరే నువ్వే తెలివైనవాడివి' అని ఊరుకోవడం.

## పనిలో మునిగితేలేవాడు

- అతను ఎప్పుడూ ఏదో ఒక పనిలో మునిగితేలి ఉండటాన్ని ఇష్టపడతాడా లేక 'అనుభవించు రాజా' అన్నట్లు జీవితాన్ని ఎంజాయ్ చేస్తుంటాడా?
- ఎప్పుడూ పనిలో మునిగి ఉంటూ యాక్టివ్ జీవితాన్ని గడిపేవాడిలో ఆత్మవిశ్వాసం జవజవలాడుతూ ఉంటుంది. మంచి క్రమశిక్షణతో అతను ఏవో జీవిత లక్ష్యాలకు కట్టుబడివాడై ఉంటాడు.
- భార్య లేక ప్రియురాలు అతడి కాళ్ళకు బంధాలు వేయటం కంటే పరిపూర్ణమైన అతడి జీవితంతో పాలుపంచుకుని అతడికి చేయూతనిస్తూ తానూ ఆనందాన్ని పొందటానికి ప్రయత్నించటం ఉత్తమం.
- అలా కాక పనికి వెనుకంజవేసే భయస్తుడు తనకు తెలిసిన చేతలకే పరిమితమై పోతూ జీవితాన్ని కుదించుకుంటాడు.
- జీవితం రవరవలాడుతూ గడపాలని కోరుకునే స్త్రీ ఇతడిని అవతలికి నెట్టేయటం మంచిది.

## సర్దుకుపోయేవాడు

- మొండిగా తన అభిప్రాయమే సరి అయినదంటూ మంకుపట్టు పడతాడా లేక నువ్వు చెప్పేది కూడా విని అది కరెక్టేననిపిస్తే తన అభిప్రాయాన్ని మార్చుకుంటాడా?
- స్త్రీ పురుషుల సంబంధ బాంధవ్యాలలో సర్దుకుపోయే గుణం ఎప్పుడూ విజయ సూచికగా పనిచేస్తుంటుంది.
- అయితే ఎంతసేపూ ఆడదాని కోర్కెలకూ వాదనలకూ లొంగిపోయే 'మేదకుడు' డల్‌గా ఉంటాడనేది నిర్వివాదాంశం. ప్రియురాలితో వాదించి మెప్పించేవాడు ఎప్పుడూ రసవంతుడూ రసజ్ఞుడూనే!
- తనకు భర్తగా మేదకుడు కావాలా రసజ్ఞుడు కావాలా అన్నది మాత్రం ఆ అమ్మాయి తేల్చుకోవాల్సిన విషయం!

## కులాసారాయుడు

- కొత్తవాళ్ళ వద్ద బెరుకు లేకుండా ఉంటాడా లేక కొత్త పరిస్థితులకి భయంతో బెంబేలెత్తిపోతుంటాడా?
- ఇతరుల మీద భరోసా ఉంచి కలివిడిగా వాళ్లతో కలిసిపోయేవాడు నూతన

అనుభవాలను ఆశావాదంతో ఆహ్వానిస్తాడు. ఇతరులతో అతని సంబంధ బాంధవ్యాలు కూడా అర్థవంతంగా ఉంటాయి.

- ఒకసారి అతను స్త్రీకి కమిట్ అయితే ఆమెకు తన హృదయకవాటాల్ని తెరిచి ఉంచి పాజిటివ్ దిశగా జీవననౌకను కొనసాగిస్తాడు.

## నిర్ణయాలు తీసుకోలేకపోవటం

- షాపింగ్ చేయటం, హోటలుకు వెళ్ళటం, సెలవుదినాల్ని గడపటం లాంటి విషయాలలో అతను ఎక్కడ, ఎలా, ఏమిటి అనుకుంటూ ఒక పట్టాన నిర్ణయాలు తీసుకోలేక పోతుంటాడా?
- ఏ విషయంలోనైనా త్వరగా ఒక నిర్ణయానికి రాలేని వారిలో ఆత్మవిశ్వాసం లోపించి ఉంటుంది. అతనికి సరైన జడ్జిమెంట్ అంటూ ఉండక ఎప్పుడూ ఇతరుల సలహాల మీద ఆధారపడుతుంటాడు.
- అయితే సంసారరథంలో తను సారథి కాదల్చుకున్న స్త్రీకి ఇతను మంచి జోడీ!

## కోపధారి

- ఏ విషయం మీదైనా చర్చించుకొనేటప్పుడు అతను గభాల్న కోపానికి వచ్చేస్తాడా?
- తీవ్రమైన ఉద్వేగాలతో కొట్టుమిట్టాడే మనిషి ప్రేమలో కూడా అంతే తీవ్రంగా ఉంటాడు గాని తాను విభేదించే విషయాలకు చెందిన చర్చలలో నిగ్రహాన్ని కోల్పోవటమనేది అతడి మనో పరిపక్వతా లోపానికి చిహ్నంగా అనుకోవాలి.
- అయితే అతని స్త్రీ నిరాశ చెందాల్సిన పనిలేదు. ఆమె అతడిని నిజంగా ప్రేమిస్తోంటే, సహనంతో అతడికి కోపాన్ని కంట్రోల్ చేసుకోవటం ఎలాగో నేర్పవచ్చు. తద్వారా అతడిని తనకు అనుకూలంగా మార్చుకోనూవచ్చు.

## కృతజ్ఞతా మార్కుడు

- అతడికి నువ్వు ఏ కాస్త సహాయం చేసినా నిన్ను పొగడటం లేకపోతే మాటిమాటికీ థాంక్స్ చెప్పటం లాంటివి చేస్తుంటాడా?
- చేసిన ప్రతి చిన్న సహాయానికీ కృతజ్ఞతలు చెప్పేవాడు సుతిమెత్తని మనస్సు కలవాడూ, మానసికంగా ఉదారుడూ అయి ఉంటాడు. అవతలి వాళ్ళలో తన పట్ల ప్రేమ పెంపొందాలి అంటే తనూ కొంత ప్రేమను ప్రదర్శించాలనే నగ్నసత్యాన్ని ఎరిగినవాడై ఉంటాడు. అతను స్త్రీలను మెచ్చుకోవటానికి ఏ మాత్రం వెనుకాడడు.

- ఆదర్శ భర్త అయ్యే అవకాశాలు ఇతనిలో ఎక్కువ!

## ఇతరుల మీద నెపం పెట్టేవాడు

- తోటివాళ్ళు తనను వంచిస్తున్నారనీ లేకపోతే తనను నాశనం చేయజూస్తున్నారనీ తరచుగా గొణుగుతుంటాడా?
- ఇతరుల మీద నెపం నెట్టేవాడు తనమీద తాను జాలిచెందుతున్నవాడై ఉంటాడు. తన అవగుణాల్ని మార్చుకోవటానికి అతను ఏ మాత్రం ప్రయత్నమూ చేయడు.
- ఇలాంటి వ్యక్తికి ఎంత దూరంగా ఉంటే అంత మంచిది. ఎందుకంటే రేపు ఆమె తన జీవితంలోకి ప్రవేశించాక అతనికి ఏదన్నా దురదృష్టం ఎదురైతే "నువ్వు వచ్చిన వేళా విశేషం అలాంటిది" అంటూ దెప్పిపొడవటానికి ఏ మాత్రం వెనుకాడడు!

# 16



# విజయపథ విక్రమార్కుడు

( ఆత్మను పోగొట్టుకున్నవాడు కాదు కదా?
జాగ్రత్త నీ వ్యక్తిత్వాన్ని కుళ్ళబొడుస్తాడు!! )

సమాజంలో ప్రస్తుతం డబ్బుకున్నంత విలువ మరి దేనికీ ఉండటం లేదు. ఒక మనిషి విజయాల్నీ, స్టేటస్‌నీ, సామర్థ్యాన్నీ సూచించటానికి డబ్బు కొలమానంగా ఉంటోంది. ఫలితంగా ఆడవాళ్ళు గానీ మగవాళ్ళు గానీ మనిషి విజయాన్ని అతడి సంపాదనా సామర్థ్యంతో ముడిపెట్టి గందరగోళం చెందుతున్నారు.

నిజం చెప్పాలంటే డబ్బు సంపాదించటం వేరు, జీవితంలో విజయాల్ని సాధించటం వేరు-

డబ్బు గడించిన వాళ్లంతా విజయవంతమైన జీవితాన్ని గడిపార నేందుకు వీల్లేదు.

అలాగే డబ్బు నంపాదించకపోవటం జీవితం విజయువంతం కాలేదనేందుకు సూచనా కాదు.

మహాత్మాగాంధీ, మదర్ థెరిస్సాలు ఏమి డబ్బు సంపాదించారు? వాళ్ళకంటే విజయవంతమైన జీవితాల్ని చూడగలమా?



దురదృష్టవశాత్తూ ఈ రోజుల్లో చాలామంది ఆడవాళ్ళు ఒక మనిషి ఎమోషనల్‌గా ఎంత అధ్వాన్నస్థితిలో ఉన్నాగాని అతడు అధికారంలో ఉంటే చాలు లేక ఇంటికి కట్టలు కట్టలు డబ్బులు తెస్తుంటే చాలు, అతడిని హీరోలా, విజయజీవనుడిలా పరిగణిస్తున్నారు. ఇది చాలా శోచనీయమైన విషయం!

జీవితం పట్ల ఆరోగ్యవంతమైన దృక్పథం కలిగిన వ్యక్తి విజయవంతమైన జీవనాన్ని గడుపుతున్నవాడుగానే చెప్పుకోవాలి.

ఆర్థికంగా గానీ ఉద్వేగపరంగా గానీ జీవితంలో ఎదురయ్యే వొడిదుడుకులని నమపాళ్లలో స్వీకరించి నమర్థవంతంగా ఎదుర్కోగలిగే మనిషి నిజమైన విజయజీవనుడు!

అలాంటి వ్యక్తి మాత్రమే తన చుట్టూ ఉండేవాళ్ళ లోటుపాట్లను అంగీకరించి అవసరవేళల్లో వాళ్ళను ఆదుకోవటానికి సిద్ధంగా ఉంటాడు. భార్య విషయంలో కూడా అదే నిగ్రహాన్ని అదే సంయమనాన్ని పాటించుతాడు.

జీవితంలో డబ్బు సంపాదించటమే ధ్యేయంగా కల మనిషికి ఆడపిల్ల దూరంగా ఉండటం మంచిది.

అందుకే పూర్వపు మేధావులు "ఆత్మను పోగొట్టుకున్నాక మనిషి ప్రపంచాన్ని జయిస్తే మట్టుకు ఏం లాభం?" అన్నారు సూక్తికంగా.

దురదృష్టవశాత్తూ సమాజంలో చాలామంది స్త్రీలు ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేని పురుషులనే ఎన్నుకుంటున్నారు.....

## విజయపు సువాసనలు

- కొందరిని చూసినప్పుడు వాళ్ళు బాల్యం నుంచీ విజయం మీద విజయాన్ని సాధిస్తూ అదృష్టజీవనులుగా గడిపినట్లుగానూ మరికొందరు చేయిపెట్టిన చోటల్లా అపజయం వరిస్తూ దురదృష్టవంతులుగా జీవిస్తున్నట్లుగానూ అనిపిస్తుంది. ఇందుకు వాళ్ల వాళ్ల వ్యక్తిత్వాలే కారణాలు తప్ప అదృష్టం కాదు.
- ఒక్కసారి వెనక్కు తిరిగి మీ బాల్యంలోకి చూడండి, మీకు తెలిసినవాళ్ళలో ఎవరు ఎలా పైకి వచ్చారో అర్థమవుతుంది.
- దుడుకు స్వభావంతో వాళ్ళనూ వీళ్ళనూ కంట్రోల్ చేస్తూ పెరిగిన వాళ్లు పెద్దయేసరికి నాయకత్వ లక్షణాలతో రూపుదిద్దు కుంటారు.
- ఇంటివద్ద తల్లిదండ్రుల ప్రోద్బలంతో నేమీ మరెందువల్ల నైనా గానీ కష్టపడి చదువుకునే కుర్రవాడు టీచర్ల మెప్పు పొందుతూ మంచి మార్కులతో పాసవుతూ ఉన్నత విద్యావంతుడుగా రూపుదాలుస్తాడు.
- చిన్న చిన్న అపజయాలకే కుంగిపోతూ బద్ధకించేవాడు నిరాశాజీవిగా ఎందుకూ కొరగానివాడుగా మిగిలిపోతాడు.
- అయితే మరొక విషయం కూడా ఉంది. విజయానికి అవసరమైన కొన్ని అర్హతలు జన్మతహా కూడా వస్తుంటాయి.
- చక్కటిరూపం, పదునైన మేధస్సు, దేహదారుఢ్యం మొదలైనవి ఇలాంటి అర్హతలు మనిషికి ప్లస్‌పాయింట్లుగా ఉంటూ విజయపథం లో అడుగడుగునా తోడ్పడుతుంటాయి. వీటికి తోడు పట్టుదల, సహనం, దూసుకు పోయే స్వభావం మొదలైనవి అతడిలో సామర్థ్యం మెరుగుపడటానికి దోహదం చేస్తాయి.

ఇప్పుడు నీ బాయ్‌ఫ్రెండ్‌లోని వ్యక్తిత్వ లక్షణాలనీ, స్వతస్సిద్ధంగా అతడిలో ఉన్న అర్హతలనీ బేరీజు వేసుకోవటం ద్వారా వ్యక్తిగతంగా గానీ వృత్తిపరంగా గానీ అతడు జీవితంలో విజయాల్ని సాధించగలడో లేదో తెలుసుకోవచ్చు-

## విజయచిహ్నాలు

❒ విజయపథంలోకి దూసుకుపోయే మనుష్యులందరిలోనూ కొన్ని ప్రత్యేక లక్షణాలు కొట్టొచ్చినట్లు కనిపిస్తాయి. వాళ్లు ఏ రంగంలో రాణించడానికి ప్రయత్నిస్తున్నా సరే ఈ లక్షణాలు వాళ్ళకు తప్పకుండా విజయాన్ని సిద్ధింపచేస్తాయి.

○ ఆ లక్షణాలు ఇవీ :

★ జీవితం పట్ల ఒక దృక్పథం, ధ్యేయం ఉండటం

★ తనకు సాధ్యంలో ఉన్న లక్ష్యాలనే ఎన్నుకోవటం.

★ లక్ష్యసాధన కోసం అంకితభావంతో కృషి చేయటం.

★ రిస్కులు తీసుకుంటూ అపజయం ఎదురైనప్పుడు నిరాశకు లోను కాకుండా ఉండటం

★ కష్టపడి పనిచేయటం

★ అడ్డంకుల్ని అధిగమించటానికి కావాల్సిన ఓర్పు, నేర్పు.

★ మొండి పట్టుదల

★ అవసరమైనప్పుడు ఇతరుల సలహా తీసుకుని దానినుంచి ఎంతో కొంత నేర్చుకోవటం

★ ఆత్మవిశ్వాసం

★ స్వయం ఔన్నత్య భావం

## అపజయ చిహ్నాలు

❒ జీవితంలో ఏ పనిని చేపట్టినా ప్రతిసారీ ఓడిపోయే దురదృష్టవంతులంటూ కొందరుంటారు.

❒ వాళ్ళను మనం దురదృష్టవంతులంటున్నాము గాని నిజానికి వాళ్లకా పదం అన్వయించదు. విజయవంతులు కావటానికి అవసరమైన పాజిటివ్ లక్షణాలు వాళ్ళలో లేవంటే బాగుంటుంది.

❒ ఇలాంటి అపజయ జీవులలో కామన్‌గా ఉండే కొన్ని నెగెటివ్ లక్షణాలను చూద్దాము.

★ తనకు ఏం కావాలో లక్ష్యాన్ని నిర్దేశించుకోలేకపోవటం, ఒకవేళ నిర్దేశించుకున్నా ఆ లక్ష్యసాధనకు అవసరమైన మార్గాన్ని ఎన్నుకోలేకపోవడం

★ తన సామర్థ్యం, లోటుపాట్లకు సంబంధించి వాస్తవబద్ధంగా ఆలోచించలేక ఫాంటసీలో జీవించటం

★ ఎదురుదెబ్బ తగిలినప్పుడు నిస్పృహకు లోనై మధ్యలోనే ఆ పనిని ఆపేయటం.

★ మనస్సు ఒక చోట నిలవకపోవటం, బద్ధకం.

★ డిసిప్లిన్ కొరవడటం

★ సక్సెస్‌కి (విజయానికి) సంబంధించి భయం - తను దానికి అర్హుడు కాడేమోనని.

★ మార్పును తట్టుకోలేకపోవటం, పోటీ అంటే భయం, అపజయం ఎదురవుతుందేమోననే శంక.

★ ఇతరుల పట్ల నిరసనభావం, తలబిరుసుతనం

★ 'అందని ద్రాక్ష పుల్లన' అనే నెగటివ్ భావం.

★ ఇతరుల పట్ల ఈర్ష్య, అసూయ, ఓర్వలేనితనం

★ ఆత్మనూన్యత, కించబాటుదనం

❒ పై లక్షణాలుండే 'సహజ పరాజితులు' తమతో జీవితాన్ని పంచుకునే స్త్రీలతో పరిపక్వ సంబంధాన్ని మెయిన్‌టెయిన్ చేయలేరు. అందుకు కారణం పైన చెప్పిన నెగటివ్ లక్షణాల మూలంగా వాళ్ళు ప్రియురాలి పట్ల బాధ్యతల్ని స్వీకరించకపోవటమే!

కాబట్టి, వయ్యారి భామా!

నీ బాయ్‌ఫ్రెండ్‌లో పైన చెప్పిన అవలక్షణాలున్నాయేమో ఒకసారి పరిశీలించి చూడు!

❧

# 17



# ఆర్థిక విజయాలు - ఉద్వేగ ఫలితాలు

( ఆర్థిక పరాజయుడయినా పరవా యిల్లె
ఉద్వేగ విజయుడైతే చాలు సుఖం నీ సొంతమకో! )

సంతోషం, దుఃఖం, కోపం, భయం, ప్రేమ ఇవన్నీ ఉద్వేగాల కోవలోకి వస్తాయి. వీటిలో సంతోషం, ప్రేమలాంటివి పాజిటివ్ ఉద్వేగాలు. ఇవి ఉద్వేగపరమైన విజయానికి చిహ్నాలు.

కోపం, భయం, దుఃఖం లాంటివి నెగటివ్ ఉద్వేగాలు. ఇవి ఉద్వేగపరమైన అపజయానికి చిహ్నాలు.

ఎవరైనా కానీ తీవ్రమైన ఉద్వేగంలో ఉన్నప్పుడు దాని ప్రభావం అతడి శరీరం మీద ప్రతిఫలించి ప్రవర్తనలో ప్రతిబింబిస్తుంది.

మనిషికి సాధారణ ఉద్వేగాలు సహజమే కాని తీవ్రమైన స్థాయిలో ఉంటే మాత్రం అవి అతడికీ అతడి చుట్టూ ఉండేవాళ్ళకూ నష్టాన్ని కలగజేస్తాయి.

- ఇవి ఉద్వేగాలకు సంబంధించిన సంక్షిప్త సమాచారం ఇది.

ఇక ధనార్జన విషయాన్ని తీసుకున్నప్పుడు -

- ఈ రోజుల్లో ఒక మనిషి విజయవంతుడు కావటాన్ని (సక్సెస్‌ఫుల్ కావటాన్ని) అతడు ఆర్జించే డబ్బుతో ముడిపెట్టటం జరుగుతోంది. మరో మాటలో చెప్పాలంటే ఆధునిక కాలంలో మనిషి ఎంతగా డబ్బును సంపాదించగలిగితే అతడిని అంతగా విజయవంతుడుగా గుర్తిస్తున్నారు.
- అయితే ఇక్కడొక తిరకాసు వుంది. డబ్బు సంపాదనకీ ఉద్వేగాలకీ మధ్య పెద్ద లంకె ఉంటుంది.
- అత్యధిక సందర్భాలలో మనుషులు ఉద్వేగాల ఖర్చు మీద డబ్బును సంపాదించటం జరుగుతుంటుంది.
- ప్రశాంతమూ, నిలకడా కల ఆరోగ్యవంతమైన ఉద్వేగ జీవనులు అంటే పాజిటివ్ ఉద్వేగ జీవనులు డబ్బు సంపాదనలో వెనకపడటమూ జరుగుతోంది.

- ఈ రకంగా ఈ రోజుల్లో డబ్బు సంపాదనకీ ఉద్వేగాలకీ మధ్య లంగరందటం లేదు.

ఇక ఆడపిల్ల వేపు నుంచి చూసినప్పుడు - ఆమె-

- ఉద్వేగపరంగా అపజయాన్ని పొందుతూ (అంటే నెగటివ్ ఉద్వేగాలలో కొట్టుకుపోతూ) ధనార్జన చేసే పురుషుడిని చేసుకోవాలా లేక ఉద్వేగపరంగా విజయపీఠం మీద కూర్చుని (అంటే పాజిటివ్ ఉద్వేగాలనేలుతూ) ధనార్జనలో వెనకబడిపోయిన పురుషుడిని ఎన్నుకోవాలా?
- ఆడపిల్లకు సంబంధించి ఇది మిలియన్ డాలర్ల ప్రశ్న!!

ఇప్పుడు ఈ రెండు స్థితిగతులకూ మధ్య ఉండే తేడాల గురించి చూద్దాము.

## ధనార్జనలో విజయం, ఉద్వేగపరంగా పరాజయం

- ఇలాంటి పురుషుడితో స్త్రీకి ఈ క్రింది సమస్యలు ఉత్పన్నమవుతాయి.

- అతడామెకు లౌకికపరమైన అన్ని సౌఖ్యాలనూ సమకూర్చగలడు గాని ప్రేమ, ఆప్యాయత, లాలన లాంటి ఉద్వేగపరమైన అవసరాలను తీర్చలేడు.
- కుటుంబానికి సంబంధించిన బాధ్యతలు, సమస్యల్ని పంచుకోవటానికి అతనామెకు అందుబాటులో ఉండడు.
- ఆమెకు అందరాని ఎత్తులో స్వతంత్ర జీవనాన్ని గడుపుతూ అతను ఆమెను మానసికంగా వంటరితనానికి గురి చేస్తాడు.

- వగలల్లా ధనార్జన గొడవల్లో పడిపోయి ఉన్న మనిషి రాత్రి అయ్యేసరికి మానసికంగానూ, శారీరకంగానూ అలిసిపోయి ఉండి ఆమె అవసరాలను పట్టించుకునే స్థితిలో ఉండడు. ఆమెతో మననం విప్పి మాట్లాడటానికి కూడా అతనికి తీరిక ఉండదు.
- భార్య అనే ఆవిడ అతనికి సౌకర్యార్థం కట్టుకున్న జడపదార్థంలా కనిపిస్తుంది తప్ప మానసిక బంధాన్ని వంచుకోవాల్సిన నజీవమూర్తిలా కనిపించదు.



- బలమైన వ్యక్తిత్వం ఉండి తన వ్యాపకాన్ని తాను ఏర్పరచుకోగల స్వతంత్ర జీవనురాలు మాత్రమే ఇతడిని తట్టుకోగలదు, ఇతడితో సర్దుకుపోగలదు.

## ఉద్యోగపరంగా విజయం, ధనార్జనలో పరాజయం

- ఈ బాపతు పురుషుడు భార్యను ప్రేమిస్తాడు, ఆదరిస్తాడు, హృదయంలో దాచుకుంటాడు.
- అయితే ఇతనికి లౌకిక జీవనం పట్ల సరైన అవగాహన లేకపోవటం వల్ల

ధనార్జనలో బాగా వెనకబడి ఉంటాడు.

- నగలు, వాహనాలు లాంటి ఖరీదైన లగ్జరీలను తీసేసినా పూలు, చీరలు లాంటి ఆమె చిన్న చిన్న అవసరాల్ని కూడా తీర్చలేకపోతాడు. ఫలితంగా ఆమె తరచుగా అసంతృప్తికి లోనవుతుంటుంది.
- తనకు తాను ఉద్యోగం చేసి ధనార్జన చేయగలిగే స్త్రీ అతడిని అక్కున జేర్చుకుని సుఖపడగలుగుతుంది గాని ఆర్థిక భద్రతలేని వనిత మాత్రం చిన్నచిన్న అవసరాలకు కూడా అతని వద్ద అసంతృప్తికి లోనుకాక తప్పదు.
- ఇప్పుడు ఒక మనిషి చేసే ఖర్చులు, ఆ ఖర్చుల విషయంలో అతడి దృక్పథాల్ని బట్టి అతడు ఎలాంటి ప్రేమికుడు కావచ్చునో చూద్దాము?

## అతనితో ప్రేమ రిస్కుతో కూడుకున్నది కాదు కదా? (క్విజ్)

1. అతనికి అవసరమైన ఒక ప్రత్యేక వస్తువును కొనదల్చుకున్నప్పుడు ధర విషయంలో అతను ఆచితూచి అడుగువేస్తాడా?
   (ఎ) అప్పుడప్పుడూ అలా చేస్తాడు
   (బి) లేదు
   (సి) అవును
2. ఇతరుల్ని మెప్పించటం కోసం ఒకటే ఖర్చు చేస్తుంటాడా?
   (ఎ) లేదు
   (బి) అవును
   (సి) అప్పుడప్పుడూ
3. అతని బడ్జెట్ కొద్దిపాటి బట్టలను కొనటానికి మాత్రమే సరిపోయేట్లు ఉన్నప్పుడు:
   (ఎ) ఖరీదైన కొద్ది దుస్తుల్ని మాత్రమే కొంటాడు
   (బి) చవకవి చాలా దుస్తుల్ని కొంటాడు.
   (సి) అతని వద్ద ఉన్న వాటినే రిపేరు చేయించి ఆధునికంగా ఉండజూస్తాడు
4. తన వద్ద రోజూ పాతబడి పోతుండే న్యూస్‌పేపర్లు, మాగజైన్లను అతను :
   (ఎ) పాతపేపర్ల వాడికి అమ్మటానికి కట్టకట్టి ఓపక్క పెడతాడు
   (బి) పద్ధతి లేకుండా ఆ మూలా ఈ మూలా పడేసి పాడు జేస్తాడు.
   (సి) తనకు నచ్చిన కొన్ని ముఖ్య వ్యాసాలున్న వాటిని మాత్రం తీసి దాస్తాడు
5. ఉదయాన టూత్‌పేస్టు వాడేటప్పుడు :

(ఎ) పేస్టుని అవసరానికి మించి బ్రష్‌మీద వేసుకుంటాడా?

(బి) అవసరానికంటే తక్కువగా బ్రష్‌మీద వేసుకుంటాడా?

(సి) సరిగ్గా అవసరమైనంత మాత్రమే బ్రష్‌మీద వేసుకుంటాడా?

6. త్వరగా చెడిపోయే పదార్థాలు, ఉదాహరణకు పళ్ళు, పాలు, కూరగాయలు మొదలైన వాటిని కొనేప్పుడు అతను :

(ఎ) అవసరాన్ని మించి కొంటాడా?

(బి) అవసరం కంటే తక్కువ వాటిని కొంటాడా?

(సి) ఎంత అవసరమో అన్నింటిని మాత్రమే కొంటాడా?

7. రాత్రులు తన ఇంటిలో అవసరం లేని చోట్ల ఉండే లైట్లను తీసేసి ఉంచుతాడా?

(ఎ) అవును

(బి) అప్పుడప్పుడూ

(సి) లేదు

8. రెస్టారెంటులో గానీ, హోటల్లో గానీ అతను తను ఆర్డరిచ్చిన ఆహారపదార్థాలు బాగా మిగిలిపోతే ఏం చేస్తాడు?

(ఎ) ఇంత వేస్టు చేయకుండా ఉండాల్సింది అని వాపోతాడు

(బి) పెద్ద లెక్క చేయకుండా అలా వదిలివేస్తాడు

(సి) మొత్తాన్నీ తినటానికి ప్రయత్నిస్తాడు.

9. బట్టలు లేక ఖరీదైన వస్తువుల్ని షాపింగ్ చేస్తున్నప్పుడు అతను :

(ఎ) చెక్కు రాసిచ్చి లేక క్రెడిట్ కార్డు ద్వారా లేక ఖాతాలో రాయటం ద్వారా పే చేస్తాడా?

(బి) అప్పుడప్పుడూ మాత్రమే అలా చేస్తాడు

(సి) ఖచ్చితంగా జేబులో డబ్బులున్నంత మట్టుకే కొని వెంటనే డబ్బు చెల్లించేస్తాడు.

10. అతనికి కారు గాని స్కూటరు గానీ ఉంటే ఆ వాహనం :

(ఎ) అతని తాహతుకు మించిన ఖరీదైనదా?

(బి) అతని తాహతుకు మరీ తక్కువలో ఉండి పొదుపుగా ఉంటుంది.

(సి) సరిగ్గా అతని తాహతుకు తగ్గట్లు ఉంటుంది.

## మార్కులు

ఒకో సమాధానానికీ ఈ కింది విధంగా మార్కులు వేసుకోండి.

| | | | |
|---|---|---|---|
| 1. | (ఎ) - 4 | (బి) - 2 | (సి) - 6 |
| 2. | (ఎ) - 6 | (బి) - 2 | (సి) - 4 |
| 3. | (ఎ) - 2 | (బి) - 4 | (సి) - 6 |
| 4. | (ఎ) - 6 | (బి) - 2 | (సి) - 4 |
| 5. | (ఎ) - 2 | (బి) - 6 | (సి) - 4 |
| 6. | (ఎ) - 2 | (బి) - 6 | (సి) - 4 |
| 7. | (ఎ) - 6 | (బి) - 4 | (సి) - 2 |
| 8. | (ఎ) - 4 | (బి) - 2 | (సి) - 6 |
| 9. | (ఎ) - 2 | (బి) - 4 | (సి) - 6 |
| 10. | (ఎ) - 2 | (బి) - 6 | (సి) - 4 |

**50 నుంచి 60 మధ్య మార్కులు వస్తే.....**

○ ఇతను చాలా జాగ్రత్తపరుడు. ప్రాక్టికల్‌గా ఉంటాడు. ఆర్థికపరంగా రిస్కులు తీసుకోవటానికి ఇష్టపడడు. సంప్రదాయకంగా, బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తాడు. తన ఖాతాలో ఎంత డబ్బులుంటే అంత సౌకర్యవంతంగా ఫీలవుతాడు.

○ జీవనసహచరి విషయంలో కూడా ఇలాగే ప్రాక్టికల్‌గా ఉంటాడు. ఉధృతమైన ప్రేమనీ, రొమాన్సునీ ఇతడి నుంచి ఆశించటం అవివేకం. తనలాగే పొదుపరితనం, ధనార్జన పట్ల వ్యామోహం ఉన్న స్త్రీ లభిస్తే ప్రేమగా చూసుకుంటాడు. తన ధోరణిలో తాను మొండిగా ఉంటాడు. విమర్శను సహించడు. భార్యకు అసాధారణ బహుమతుల్నీ ఇవ్వడు!

**40 నుంచి 49మధ్య మార్కులు వస్తే.....**

○ కొద్దిపాటి జల్సాకు వెనుదీయడతను. అవసరాన్ని బట్టి ఖర్చు పెడతాడు, అవసరం లేనప్పుడు పొదుపుగానూ ఉంటాడు.

○ భార్య నుంచి తను ఊహించని ఆశ్చర్యకరమైన ప్రవర్తనను ఇతను ఆమోదించడు. ఆమె కొద్దిపాటి స్వేచ్ఛగా ప్రవర్తించబోయినా వప్పుకోడు. సంప్రదాయబద్ధంగా, సమాజం ఆమోదించే రీతిలో ఆమె సక్రమ ప్రవర్తనను కలిగి ఉండాలని ఖచ్చితంగా చెప్పేస్తాడు. తన బాధ్యతలకు కట్టుబడి ఉంటాడు.

**30 నుంచి 39 మధ్య మార్కులు వస్తే.....**

○ ఇతనిలో కొంచెం చపలత్వం ఉంటుంది. పొదుపు విషయంలో కొంతకాలం పాటు ఎంత నిగ్రహాన్ని పాటిస్తాడో అంతలోనే సడెన్‌గా చపలత్వానికి లోనై తను కొనాలనుకున్న వస్తువును ఎంత ఖర్చుకైనా వెనుకాడకుండా కొనేసి దుబారా చేసేస్తాడు.

ఒక రకమైన జూదరి మనస్తత్వం ఇతనిలో దోబూచులాడుతుంటుంది. తనను తాను అదుపులో ఉంచుకోకపోతే ఆర్థికంగా కుదేలైపోతాడు.

○ మంచి మూడ్‌లో ఉన్నప్పుడు ఇతను ప్రియురాలిని మబ్బుల్లో విహరింపజేస్తాడు. ఆర్థికమైన సెక్యూరిటీ లేకపోతే అంతలోనే ఆమె దభేల్న నేలమీద పడక తప్పదు. అతడి ఆర్థిక విషయాల్ని ఆమె తన గుప్పిట్లోకి తీసుకోగలిగితే ఆమె కృష్ణుడూ అతను అర్జునుడూ అవుతారు.

**20 నుంచి 29 మధ్య మార్కులు వస్తే.....**

○ ఇతను మరీ దుబారా మనిషి. రేపు అనేది చూడకుండా ఇప్పుడున్న వాటిని ఇప్పుడు ఖర్చుపెట్టేస్తుంటాడు. భార్యతో సంబంధాల విషయం కూడా ఇంతే. నిర్లక్ష్య ప్రేమ. పొదుపు విషయంలోఆమె ఎంత మొత్తుకున్నా దున్నపోతు మీద వర్షం పడ్డట్లుగా ఉంటుంది తప్ప ఏ ప్రయోజనమూ ఉండదు.

○ తన దుబారా మూలంగా భార్యకు చికాకు తెప్పిస్తాడు. ముఖ్యంగా తన వద్ద నున్న డబ్బులయిపోయి ఆమె డబ్బుల జోలికి పోయినప్పుడు!

○ ఏ అమ్మాయి అయినా బాయ్‌ఫ్రెండ్‌తో ప్రారంభం నుంచే డబ్బు, జీవన లక్ష్యాలకు సంబంధించి అతడి విలువల్ని అభిప్రాయాల్నీ నిశితంగా గమనించటం మంచిది.

- *ధన సంపాదనకు సంబంధించి అతని ఆలోచనలు హేతుబద్ధంగా ఉంటున్నాయా?*
- *ధన సంపాదన, ప్రేమ - ఈ రెండు విషయాలలో సమతుల్యాన్ని పాటిస్తున్నాడా?*
- *సడన్‌గా ఒక్కసారిగా ధనికుడు కావాలన్న పేరాశలో లేడు కదా?*

- ఈ మూడు ప్రశ్నలకూ సమాధానాన్ని బట్టి ఆమె అతడితో స్నేహాన్ని లేక ప్రేమను కొనసాగించాలో, వద్దో నిర్ణయించుకోవాలి.

○ ఆమెకు డబ్బు పట్ల బాగా మక్కువ ఉంటే అతడినుంచి ఉద్వేగపరమైన ఆపేక్షను ఆశించటం మంచిది కాదు.

○ అలా కాక అతడి నుంచి ప్రేమానురాగాలు కావాలి, డబ్బు విషయంలో సర్దుకుపోగలను అనుకుంటే ఆ రకమైన మనిషిని అన్వేషించాలి.

○ అంతే గాని అవ్వా కావాలి బువ్వా కావాలి అన్నట్లు ధన సంపాదనా కావాలి ఉద్వేగ పరిరక్షణా కావాలి అనుకుంటే మాత్రం ఆమె భంగపడక తప్పదు.

# 18



# మంచి భర్త అవుతాడా లేదా?

( సుగుణాభిరాముడా? అవగుణాభినాముడా?
ముందే తెలుసుకో! లేదంటే బోర్లా పడతావు!! )

ఒక అబ్బాయి, అమ్మాయి స్నేహం చేసి, ఆ స్నేహం ప్రణయంలోకి మారి, తర్వాత వాళ్ళిద్దరూ పెళ్ళాడదల్చుకున్నప్పుడు అతడు మంచి భర్త అవుతాడో లేదో తెలుసుకోవటానికి ఆమెకు ముందే అవకాశం ఉంటుందా లేదా??

ఉంటుంది!

ఇరువురు స్త్రీ పురుషులు వివాహంలో ఇరుక్కున్నాక వాళ్ళ బంధం పటిష్టంగా, విజయవంతంగా ఉండటానికి వాళ్ళ అభిరుచులూ టెంపర్‌మెంట్‌లూ కలవటం ఒక ముఖ్య అంశమే అయినా పురుషుడికి సంబంధించి స్వతస్సిద్ధమైన కొన్ని సలక్షణాలు, కొన్ని దుర్లక్షణాలు అంటూ వుండి అవి వివాహబంధాన్ని నిలిపి ఉంచటానికి లేక విచ్ఛిన్నం చేయటానికి చిహ్నాలుగా పనిచేస్తుంటాయి.

ఇప్పుడు ఆ లక్షణాల గురించి చూద్దాము.

**మంచి భర్తకుండే సలక్షణాలు**

**అమ్మాయీ!**



○ ఒక యువకుడు మంచి భర్తగా రూపుదిద్దుకునేందుకు అతడిలో జీవితానికి సంబంధించిన ఈ కింది అంశాలు ప్లస్ పాయింట్లుగా పనిచేస్తుంటాయి.

అవి నీ బాయ్‌ఫ్రెండ్‌కి ఉన్నాయో లేవో ముందే చూసుకో!

★ అతడి తల్లిదండ్రులు కలతలు లేకుండా సంసారం చేస్తుంటారు.

★ తల్లితో అతడికి ఆరోగ్యకరమైన సత్సంబంధాలు ఉన్నాయి.

★ అతని కుటుంబానికి సంబంధించిన మిగతా సభ్యులు అంటే సోదరీసోదరులు పెళ్ళయి కాపురాలు చేసుకుంటున్నారు.

★ చక్కటి పిల్లలు, శుభ్రమైన సంసారాన్నీ తను కోరుకుంటానని సిగ్గుపడకుండా చెప్పుకుంటాడతను.

★ అతడు తన బాధ్యతల్ని అంగీకరిస్తాడు. తన ఉద్యోగాన్ని ఇష్టపడతాడు.

★ మనిషికి జీవితంలో వివాహము, సంసారమూ ముఖ్యమని భావించే సంప్రదాయిక కుటుంబం నుంచి వచ్చాడతను.

★ పెళ్ళీ పెటాకులు లేకుండా ఒంటరి జీవితాన్ని గడపటం పట్ల అతనికంత ఆసక్తి ఉండదు.

★ అతని దగ్గరి మిత్రులంతా పెళ్ళయి శుభ్రంగా కాపురాలు చేసుకుంటున్నవాళ్లే

★ నీతో కలిసి కాలక్షేపం చేయటం అతనికి ఇష్టంగా ఉంటుంది.

★ నీ గురించి ఇతరులతో గొప్పగా బడాయిగా చెప్పుతుంటాడు

## సుగుణాలు

❒ ఏ వ్యక్తి గానీ మంచి భర్త కావటానికి అతనిలో ఈ కింది సుగుణాలు అవసరం. వీటిలో నీ కిష్టమైన పది లక్షణాలను ఎన్నుకో.

❒ ఆ పదింటిలో కనీసం 6 లక్షణాలు నీ బాయ్‌ఫ్రెండ్‌లో ఉంటే అతడు తప్పకుండా మంచి భర్త అవుతాడని గుండెల మీద చేయి వేసుకోవచ్చును!

★ మొండితనం లేదు

★ ఆకర్షణీయంగా ఉంటాడు

★ ఇతరులకు సహాయం చేస్తుంటాడు

★ సహనశీలి

★ ఆర్థిక భద్రత ఉంది

★ సంప్రదాయిక కుటుంబీకుడు

★ మేధోజీవి

★ ధైర్యవంతుడు

★ నిజాయితీపరుడు

★ స్నేహశీలి

★ స్వతంత్ర భావాలు కలవాడు

★ దయాళుడు

★ ఆత్మవిశ్వాసం కలవాడు

★ సున్నిత మనస్కుడు

★ సానుభూతి చూపించగలడు

★ కమిటెడ్ గా (అంకితభావంతో) ఉంటాడు

★ సెన్సాఫ్ హ్యూమర్ ఉంది

★ అవసరాన్ని బట్టి పట్టువిడుపులు ప్రదర్శిస్తుంటాడు

★ సెక్సుపరంగా సంతృప్తి పరచగలడు

## దుర్లక్షణాలు

☐ పురుషుడిలో ఈ కింది దుర్లక్షణాల్ని అతడు మంచి భర్త కాడనేందుకు సూచనలుగా తీసుకోవచ్చు. నీ బాయ్‌ఫ్రెండ్‌లో అవి ఉన్నాయో లేవో చూసుకో.

☐ ఒకవేళ వాటిలో అత్యధిక భాగం అతనిలో ఉంటే అతడెప్పుడో ముందు ముందు మారతాడని భ్రమలు పెట్టుకోకు. ఏ మాత్రం మారదతను. కాబట్టి ముందుగానే జాగ్రత్త పడటం మంచిది.

★ ఆడవాళ్ళ పట్ల అతనికి కోపం
★ పూర్వజీవితంలో అతడిని ఏ స్త్రీనో మోసగించింది.
★ 'వివాహం ఒక దరిద్రగొట్టు వ్యవస్థ', అంటాడు
★ అంతకు మునుపు ఎప్పుడో ప్రేమించి ఏ కారణంవల్లో విఫలమైన అమ్మాయి అతని మనస్సులోంచి ఇంకా చెరిగిపోలేదు.
★ వివాహానికి తనింకా సిద్ధంగా లేనని అనుకుంటున్నాడు
★ సరిగ్గా నిద్రపోలేడు. ఎప్పుడూ పీడకలలతో బాధపడుతుంటాడు.
★ అతని స్నేహితులలో ఎక్కువమంది అవివాహితులు. వాళ్ళతో ఎక్కువగా పార్టీలు చేసుకుంటుంటాడు.
★ ఎప్పుడూ తన వృత్తి లేక ఉద్యోగం గురించి నసగా చెబుతుంటాడు
★ తనకు ప్రైవసీ అతిగా ఉండాలని కోరుకుంటాడు.

## అవగుణాలు

☐ ఈ లోకంలో ఏదో ఒక అవగుణమంటూ లేనివాళ్ళు ఉండటం కష్టం. అయితే ఈ కింద ఇచ్చిన వాటిలో ఏ 6 లేక అంతకు మించిన అవగుణాలున్నా ఆ వ్యక్తిని వివాహానికి పనికిరానివాడుగా భావించవచ్చు.

★ చాదస్తుడు
★ సహనం లేనివాడు
★ బాధ్యతల్ని ఫీలవనివాడు
★ కుత్సితపు వాడు
★ డల్‌గా ఉంటాడు
★ జగమొండి

★ హృదయం విప్పి మాట్లాడడు
★ ప్రతి వాళ్ళమీదా శత్రుభావం ఉంటుంది
★ మొరటు మనస్సు
★ ఆకర్షణీయంగా ఉండడు
★ ముభావి
★ పిరికివాడు
★ నిజాయితీ లేదు
★ ఎప్పుడూ ఒకళ్ళమీద ఆధారపడి ఉంటాడు
★ సెన్సాఫ్ హ్యూమర్ అసలు లేదు
★ ముక్కుమీదే కోపం ఉంటుంది.
★ చిర చిర స్వభావం
★ మూడీగా ఉంటాడు
★ వ్యసనాలెక్కువ. (ఏ ఒక్కటున్నా చాలు!)
★ వంటరివాడు
★ జెలసీతో బాధపడుతుంటాడు
★ విమర్శనా జీవి
★ వంచించే స్వభావం ఉంది.

❑ నీ బాయ్‌ఫ్రెండ్‌లో పైన చెప్పినవాటిలో ఎన్ని అవగుణాలున్నాయో బాగా పరిశీలించు. వాటిని బట్టి అతడితో ఇంకా ముందుకు సాగవచ్చునో లేదో నిర్ణయించుకో!

## దాంపత్య విజయానికి సోపానాలు

❑ దాంపత్య సంబంధాలు విజయవంతం కావాలంటే స్త్రీ పురుషులిరువురిలోనూ కామన్‌గా కలవాల్సిన కొన్ని లక్షణాలంటూ ఉంటాయి. నీ బాయ్‌ఫ్రెండ్‌కీ నీకూ మధ్య ఈ కింది వాటిలో ఎన్ని కలిసే లక్షణాలున్నాయో నిజాయితీగా పరిశీలించు.

❑ ఎన్ని కలిసే లక్షణాలు ఉంటే అంతగా తర్వాతి జీవితంలో మీ దాంపత్యం సాఫీగా సాగుతుందని భావించు.

★ పరస్పర గౌరవం, అంగీకారం
★ జీవన లక్ష్యాలు, విలువలు ఏకీభవించటం

- ఎమోషనల్‌గా కలిసిపోవటం
- నిజాయితీగా, నిర్మాణాత్మకంగా హృదయం విప్పి మాట్లాడుకోవటం
- దైహిక ఆకర్షణ
- ఏకీభవించే అభిరుచులు, ఆసక్తులు
- ఒకరిపట్ల ఒకరికుండే ప్రేమనూ, మెచ్చుకోలునూ పరస్పరం వెళ్ళడించుకోవటం
- ఒకరి గురించి ఒకరికి వాస్తవబద్ధమైన అంచనాలు...

# 19



# మేడ్ ఫర్ ఈచ్ అదరేనా?

(ఆడదాని పట్ల అతని అభిప్రాయం అడుగు!
నీతో అతని స్పందన తెలుస్తుంది!!)

పరువానికి పడగెత్తిన పాపాయీ!

ప్రేమికులలో నానా రకాల వాళ్ళుంటారు.

ఒక వ్యక్తి ఒక అమ్మాయితో స్నేహం చేసి, పెళ్ళి దాకా కూడా వెళ్లి, ఎంత మంచి ప్రేమికుడో అని అంతా ముక్కున వేలేసుకుంటుండగా ఆమెతో జీవితాన్ని సజావుగా గడపక వేధిస్తుండవచ్చు.

మరో వ్యక్తి ప్రేమించినన్నాళ్ళూ ప్రేమించి ఆఖరుకు వివాహం ప్రస్తావన వచ్చేసరికి రేపు చెబుతానంటూ మళ్ళీ అయిపు లేకుండా మాయమయిపోవచ్చు.

కాబట్టి మైడియర్ బటర్ ఫ్లై!

నువ్వు స్నేహం చేసే బాయ్‌ఫ్రెండ్ ఎలాంటివాడో ముందే క్షుణ్ణంగా 'స్టడీ' చేయటం నీకు శ్రేయస్కరం! అందుకు ఇక్కడ దాకా చదివిన అధ్యాయాలు నీకెంతగానో తోడ్పడతాయి.

ఇప్పుడు మరో చిన్న క్విజ్ :



## ఆఖరి క్విజ్

ఈ క్విజ్‌ని బట్టి మీరిద్దరూ 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అవుతారో కాదో తెలుసుకోవచ్చు!

ఈ కింది ప్రశ్నలకు ఎప్పుడూ, అనేకసార్లు, అప్పుడప్పుడూ, ఎప్పుడన్నా, ఎప్పుడూ లేదు లాంటి సమాధానాలలో ఏది సరిపోతుందో అది రాయండి.

1. తన కోపతాపాలు, మిగతా ఉద్వేగాల గురించి నీతో చర్చించటానికి అతను సంకోచిస్తాడా?
2. నువ్వు నీ ఫీలింగ్స్ గురించి చెబుతున్నప్పుడు వాటిని అతను అర్థం చేసుకోవటం లేదా?
3. మీ మధ్య చిన్న చిన్న అభిప్రాయ భేదాలే చిలికి చిలికి పోట్లాటల కింద మారుతుంటాయా?
4. అతడు నీతో శరీర సంపర్కం కోసం ప్రయత్నిస్తాడు. నువ్వు ఒప్పుకోకపోతే కోపం తెచ్చుకుంటాడా?
5. అతను నీతో అబద్ధాలు చెబుతున్నట్లుగా అనిపిస్తోందా?
7. అతనికి జూదం, తాగుడు, డ్రగ్స్ సేవనం లాంటి స్వనాశక వ్యసనాలున్నాయా?

8. మతం, రాజకీయాలు లాంటి విషయాల మీద మీరెప్పుడన్నా చర్చలో పడి ఆఖరున తీవ్రంగా ఘర్షణ పడ్డారా?
9. అతను నీ స్నేహితురాళ్ళలో ఎవరినన్నా కలిసినప్పుడు నువ్వు ఇబ్బందిని ఫీలయ్యావా?
10. ఎప్పుడన్నా అతను నిన్ను గర్హించటం గానీ అవమానించటం గానీ చేసాడా?
11. నీ ఆశయాలు, నీ కలల పట్ల అతను అనాసక్తిని ప్రదర్శిస్తున్నట్లు అనిపించిందా?
12. నువ్వతణ్ణి తాకబోయినప్పుడు ఎడంగా జరుగుతాడా?
13. నీ మనస్సులో కదులుతున్న ఆలోచనల్ని అతనికి చెప్పటం నీకు ఇష్టముండదా?
14. నీ అవసరాల కంటే అతనికి తన ఉద్యోగ సంబంధ విషయాలు ముఖ్యంగా అనిపిస్తాయా?
15. తనకు తగిలే ఎదురు దెబ్బలకూ అపజయాలకు అతడు నిన్ను నిందిస్తుంటాడా?

## మార్కులు

నువ్విచ్చిన సమాధానాన్ని బట్టి మార్కులు ఈ కింది విధంగా వేసుకోవాలి.

ఎప్పుడూ - 0, అనేకసార్లు - 1, అప్పుడప్పుడూ - 2, ఎప్పుడన్నా - 3, ఎప్పుడూ లేదు - 4

**49 నుంచి 60 మధ్య మార్కులు వస్తే .....**

- మీరిద్దరూ తప్పకుండా మేడ్ ఫర్ ఈచ్ అదరే! ఒకరి విషయాన్ని ఒకళ్ళు హృదయం విప్పి మాటాడుకుంటారు. సుసంపన్నమైన సంతృప్తికరమైన రొమాంటిక్ జీవనం మీది.
- సామాజిక, గృహ సంబంధమైన విషయాలలో మీ మధ్య ఏకీభావం ఉంటుంది. ఒకవేళ ఎప్పుడైనా బేధాభిప్రాయాలు కలిగినా హృదయం విప్పి సామరస్య పూర్వకంగా చర్చించుకుంటారు. నీకు ప్రేమనూ సంతృప్తినీ అందించే పరిపక్వ ప్రేమికుడితను.

**37 నుంచి 48 మధ్య మార్కులు వస్తే .....**

- అనేక ముఖ్యమైన విషయాలలో మీరిద్దరూ ఏకీభావానికి వస్తారు కాని కొన్ని విచిత్ర సందర్భాలలో మాత్రం కోపంగా ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకుంటారు.

- ఒకవేళ మీరు రాజీకి రాలేకపోతే మీ మధ్య భేదాభిప్రాయం ఉందనీ, ఆ విషయంలో రాజీకి రాలేకపోతున్నామనీ ఒకరితో ఒకళ్ళు ఒప్పుకోగలుగుతారు కూడా.

మొత్తం మీద ఇతను నిన్ను గౌరవిస్తాడు, అర్థం చేసుకుంటాడు. నీ పట్ల తన ప్రేమను తెలియజెప్పటానికి వెనుకాడడు. అప్పుడప్పుడూ మూడీగా ఉంటాడు. నిన్ను సంతోషపెట్టటం తన కర్తవ్యంగా భావిస్తాడు. అందుకోసం పక్కదారులు తొక్కటానికి కూడా వెనుకాడడు.

**25 నుంచి 36 మధ్య మార్కులు వస్తే....**

- మీ మధ్య సంబంధం ఇచ్చి పుచ్చుకునే ధోరణిలో ఉంటుంది. అయితే మీ స్నేహం పెళ్ళిదాకా వెళ్తుందా లేదా అనేది కాలమే చెప్పాలి. కలిసి ఉండాలనే కాంక్ష మీ మధ్య బలీయంగా ఉంటే మాట అది-

**13 నుంచి 24 మధ్య మార్కులు వస్తే .....**

- ఏమంత సరిజోడీ కాదు మీది. మీ మధ్య కమ్యూనికేషన్ గ్యాప్ ఎక్కువగా ఉంటుంది. ఏకాభిప్రాయానికి రావటం కంటే బేదాభిప్రాయాలలో కొట్టుమిట్టాడటమే మీ మధ్య ఎక్కువ.
- అతడి స్వార్థపరత్వం నిన్నతడి దగ్గరకు చేరనివ్వదు. చిన్న చిన్న విషయాలను కూడా మీరు సామరస్యంగా చర్చించుకోలేరు. నిజం చెప్పాలంటే మీ మధ్య ప్రేమ పెంపొందే అవకాశం ఏమాత్రం లేదు!



**12 లోపు మార్కులు వస్తే....**

జాగ్రత్త, ఇతని దృష్టిలో నువ్వు మరీ పిపీలికానివి. అతని వద్ద నీకే విలువా ఉండదు. ఇతనితో జీవితం ఆత్మహత్యా సదృశ్యం!

*(ఈ క్విజ్ పెళ్ళయిన ఆడవాళ్ళకు కూడా భేషుగ్గా అన్వయిస్తుంది!)*

ఇక ఆఖరుగా పురుషుడు స్త్రీలో ఎలాంటి లక్షణాలను ఇష్టపడతాడో ఆమె అతనితో ఎలా సర్దుబాటు చేసుకోవాలో చూద్దాము.

## పురుషుడు స్త్రీలో ఏ లక్షణాల్ని ఇష్టపడతాడు?

- ఆడవాళ్ళు మగవాళ్ళ కంటే త్వరగా సాన్నిహిత్య భావానికి లోనవుతారు. నీవు ప్రేమలో పడ్డంత త్వరగా అతడు నీకు చేరువ కావాలని ఆశించకు. ఈ విషయంలో అతడికి కొంత పురుష సహజమైన వ్యవధానాన్ని ఇవ్వటం మంచిది.
- ప్రేమలో గానీ, రొమాన్సులో గానీ స్త్రీ పురుషులిద్దరూ సమ ఉజ్జీలే అయినా పురుషుడు మాత్రం స్త్రీ తనకంటే కొంచెం కింది చేయిగా ఉండాలని కోరుకుంటాడు. తన తెలివితేటల్ని చూసో, తన అందం చూసో, తన గొప్పతనం చూసో, స్త్రీ తనకు దాసోహమవాలని కోరుకుంటాడు. నువ్వు తనను సమ్మోహపరచాలని కోరుకుంటాడు కాని తనను వలలో వేసుకుంటున్నట్లు అనిపిస్తే మాత్రం అసౌకర్యాన్ని ఫీలవుతాడు.
- పురుషుడు స్త్రీ తనను గౌరవించాలనీ ప్రత్యేకంగా చూడాలనీ కోరుకుంటాడు. నువ్వు ఏ మాత్రం చులకనగా చూసినట్లు అనిపించినా ఎద్దేవా చేస్తున్నావని పించినా నీకు ఎడంగా జరగటానికి ప్రయత్నిస్తాడు.
- పురుషుడు తనతో సమానవంతురాలైన స్త్రీని ఇష్టపడతాడు గాని తనతో పోటీ పడే స్త్రీ పట్ల ఆసక్తిని చూపించడు. తన ఎమోషనల్ అవసరాలను తీర్చే స్త్రీ పట్ల అతను కృతజ్ఞుడై ఉంటాడు. మిగతా అందరు పురుషులతో పాటు ఆమె తననూ ఒకడిగా చూస్తే భరించలేడు.
- పురుషుడు స్త్రీ తనకు సలహాలనిస్తే స్వీకరిస్తాడు గానీ ఆజ్ఞలను జారీ చేస్తే భరించలేడు. ఎందుకంటే చిన్నప్పుడు అతనికి తల్లి ఎటూ ఆజ్ఞలను జారీ చేసింది! ఇప్పుడతనికి కావాల్సింది ఆజ్ఞలను జారీ చేసే తల్లి కాదు, సహకారమందించే భార్య!!
- పురుషుడు తనకు మరీ అంటిపెట్టుకుని ఉండే స్త్రీ పట్ల బోరు చెందుతాడు. తరచుగా అతడికామె విరామపూర్వకమైన స్వేచ్ఛను అందిస్తుండాలి.

సో.....

పాపాయ్, అదీ అసలు విషయం!

నీ బాయ్‌ఫ్రెండ్ తాలూకు గత చరిత్రను ఎంత శోధించి పరిశీలించినా, అతడి వ్యక్తిత్వాన్ని ఎంత విశ్లేషించినా, అతనితో సరితూగుతావో లేదో నీకు నువ్వు పరీక్షించుకున్నా కూడా, వివాహబంధంలోకి వచ్చేసరికి ఇంకా ఏవో కొన్ని సవాళ్ళు, సమస్యలూ ఎదురవుతూనే ఉంటాయి. అందుకే ఆడపిల్ల తనకు తాను సరిజోడీని ఎన్నుకోవటం అంత తేలికైన విషయం కాదు.....

ఈ పుస్తకం పొడుగూతా చెప్పినట్లుగా బాయ్‌ఫ్రెండ్‌ని అనేక సందర్భాలలో అనేక కోణాలనుంచి నిశితంగా పరిశీలించి సరయిన నిర్ణయం తీసుకోకపోతే పప్పులో కాలేసే ప్రమాదం ఉంది.

జీవితం ఒకసారి మాత్రమే లభించే అపూర్వవరం! అలాంటి విలువైన జీవితం విషయంలో చాలా జాగ్రత్తగా నిర్ణయాలు తీసుకోవాలి!!

మరో మాట -

బాయ్‌ఫ్రెండ్‌ని స్టడీచేయటం ఒక రోజులో అయే పనికాదు. అందుకు చాలా సమయమే అవసరం కావచ్చు. అయినా ఓపిక పట్టాలి. తొందరపడకుండా, కాలు జారకుండా జాగ్రత్తపడాలి. అందాకా ప్రేమ వేట కొనసాగుతూనే ఉంటుంది.

**ఆ ప్రేమ వేటలో నీకు,**

**చిన్నారి పొన్నారి సీతాకోకచిలుకా-**

# బెస్టాఫ్ లక్!!!



స్వప్న కంఠంనేని తలశిల

రాసిన మరో పుస్తకం -
టీనేజ్ లవ్ స్టోరీ

# "మై డియర్ రోమియో"

చదివారా? 

